Regd. No. M. 3824

సాలు చందా రు 3



విడి ప్రతి అణా

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం 23-8-39 బెజవాడ | సంచిక 36

# బీహారు 'రామరాజ్యం'లో ఏమి జరుగుతోంది?

స్వామి సహజానంద సరస్వతి

అన్యప్రాంతీయులకు, ఇక్కడి "కాంగ్రె రాజ్యం"లో, "మన గవర్నమెంటు"లో ఏం జరుగుతున్నదో బహుశా చాలమందికి తెలియదు. పత్రికల రిపోర్టులు చాలతక్కువ. అవికూడా చాలా ఆలస్యంగానూ, అప్పుడప్పుడూ వెలువడుతాయి. దీనివలన కిసాన్ ఉద్యమానికి ఎంత నష్టమో ఊహించుకోవచ్చు. ఇంతేగాక ప్రతికూల వార్తలు, ఎప్పుడుబడితే అపుడు ప్రత్యక్షమవుతాయి. అందుచేత బీహారు రాష్ట్రేతరులకు మేముపడే బాధల్ని తెలిసికోవడం చాల కష్టం.

గత బొంబాయి అఖిలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశం నుండి, వేలకొలది రైతులు జైళ్లలో వేయబడ్డారు. ఇంతేగాక చావచితుకగొట్టడం మామూలయింది. ఈ విధానము ఈమధ్య మరింత అధికమయింది. ఎ. ఐ. సి. సి. మెంబర్లనిగాని, యం. యల్ ఏ. లనుగాని పి. సి. సి. డి. సి. సి. సభ్యులనుగాని, డిస్ట్రిక్టుబోర్డు సభ్యులనుగాని, వదలిపెట్టడం లేదు. అందర్నీ ఇ. పీ. కో. 379, 447, సెక్షన్లూ, క్రి. ప్రో. కో. 144, 107- సెక్షన్లూ, అప్పుడపుడు 17, 143, 147, 148 సెక్షన్లూ విరివిగా ఉపయోగింపసాగారు. ప్రజాభద్రతకు భంగమనేపేరిట 107 వ సెక్షనును ఉపయోగించడం మామూలు. కాని 108 వ సెక్షను (రాజకీయం)ను ఉపయోగించరు. 500 పైగా ఈవిధంగా శిక్షింపబడ్డారు. మనమింకా పోరాటాన్ని సాగిస్తే, మనం లొంగిపోకుంటే, ఇంకా ఎంతోమందిని ఈ సెక్షన్లక్రింద శిక్షిస్తామని బెదరించుతున్నారు. అన్నిటికంటె పరిహాసాస్పదమైన, లేక విషాదగ్రస్తమైన విషయం ఇంకొకటి ఉంది. వేలకొలది కిసాన్‌వర్కర్లను, స్త్రీలను, బిడ్డలను జమీందారీ మనుష్యులను, పోలీసుల లాఠీలతో, బక్సత్ సత్యాగ్రహం సాగించుచున్న వందలకొలది స్థలాలలో బాదుతున్నా, రైతులు శాంతంగా, ఓర్పుగా ఉన్నారు. ఇంత వరకు పోలీసులకు, గూండాలకు, జమీందారీ మనుష్యులకు దెబ్బలు తగిలాయని నిశ్చితమైన రిపోర్టు ఒకటీ ప్రకటించబడలేదు. అయినా మనం, చాల హింసావాదులమని, క్రూరులమనీ ఇతర ప్రపంచానికి చూపాలి. అందుకనే ఈ 107 సెక్షను ప్రయోగం తీవ్ర నిరంకుశ ప్రభుత్వం సైతం, ఇన్ని 107 సెక్షనుక్రింద కేసులు- కనీసం 108 క్రింద కేసులు పెట్టలేదని. వెను

నిజంగా దురదృష్టం.

ఇంతేగాదు. "మన ప్రభుత్వం" ఆడుతున్న విచారకరమైన పాత్రను కొంత విశదీకరించాలి.

మన పోరాటంలో నల్వురు వీరాధి వీరులు ఉక్కు తునకల్లాంటి దేశభక్తులు జైయిలో

**16 వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ,**

**కాకినాడ.**

సెప్టెంబరు 1, 2, 3 తేదీలలో జరుగును.

ప్రారంభోపన్యాసకులు: శ్రీ సుభాష్ చంద్రబోసుగారు

అధ్యక్షులు: శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు

కార్యక్రమం.

సెప్టెంబరు 1 ఉదయం 10 గంటలు విషయనిర్ణయసభ
సాయంత్రము 4 గం॥ ఊరేగింపు
" 5 గం॥ పతాకోత్సవము
" $5\frac{1}{2}$ మహాసభా ప్రారంభోపన్యాసము అధ్యక్షోపన్యాసము.
రాత్రి లెఫ్టిస్టుమెటిక్ ఎసోసియేషనువారి ప్రధమ నాటకం "ఏమి చెయ్యాలి" బోసుగారి సమక్షమున ప్రదర్శింపబడును.

సెప్టెంబరు 2 ఉదయం గం॥ 7 లకు ఆటలు, పోటీలు
" గం॥ 11 లకు వాగ్వాదములు, వ్యాసరచన వక్తృత్వ పోటీలు మొదలగునవి.
మధ్యాహ్నం 3 గం॥ బహిరంగసభ సమావేశం, తీర్మానములు.

సెప్టెంబరు 3 ఉదయం 7 గంటలకు బహిరంగసభ, ఉపన్యాసములు. బహుమానములు.

ఇట్లు,
ఆహ్వాన సంఘం.

కటి ప్రభుత్వాలను మన ప్రభుత్వం తలదన్నినదని ఒప్పుకోవలసి వస్తున్నది. గొలుసులచే బిగింపబడ్డమేము "రాజకీయ ఖైదీలమయ్యా" అలా పరిగణించమంటే ప్రభుత్వం మేముప్రజాశాంతికి భంగపరుస్తున్నామనే అర్థాన్ని వెలిబుచ్చేటట్లు ప్రకటించుతుంది. ప్రజా శాంతిని కోరేవారిని ప్రజా శాంతికి భంగకారులని ముద్రవేయడం

మ్రగ్గుతున్నారు, మృత్యువు కెదురు చూస్తూ. వారు బ్రహ్మచారీ రామవృక్ష, జగన్నాధజీ, కార్యానంద శర్మ, అనిలమిత్ర, చాలాకాలం నుండి నిరశన వ్రతం పూనారు. కొందరు 73 రోజుల నుండి, కొందరు 40 రోజుల నుండి ఉపవసిస్తున్నారు. (సహజానందగారు ప్రకటించేసరికి ఇన్ని రోజులే. కాని ఆగస్టు 16 వ తేదీన అనిలమిత్రను 47 దినాల ఉపవాసానంతరం విడిచిపెట్టారు. బ్రహ్మచారిని 71 దినాల ఉపవాసానంతరం విడిచిపెట్టారని, నేషనల్ ఫ్రంటులో ఒక రిపోర్టు ఉన్నది. కాని స్వామిజీ స్టేటుమెంటు వల్లగాని, బీహారు కిసాన్ పత్రిక 'జనతా' ననుసరించి ఆగస్టు 17 వ తేదీకి 81 దినాలు నిరసన వ్రతం పూనినట్లు వార్త ఉన్నది కాబట్టి అతని విడుదల గూర్చిన రిపోర్టు తప్పు అయివుంటుంది. 17 వ తేదీకి తక్కిన ఇద్దరూ (1) జగన్నాధజీ నిరశనవ్రతం పూని 81 దినాలయింది. (2) కార్యానందశర్మ 48 దినాలైంది —సం.) ఎందుకోసం? సౌకర్యాలకోసమా? కాదు, దలకోసమా? కాదు. కార్మిక-కర్షకులనుకూడ 'రాజకీయ ఖైదీలు'గా చూడమని, వారి శక్తికొలది ప్రయత్నించారు. వారితోపాటు మేమూ 'మన ప్రభుత్వాన్ని' ఈ చిన్నకోర్కెను నెరవేర్చమని కొన్ని ఏండ్లనుండి, ముఖ్యంగా గత 6 నెలలనుండి కోరుతూ వచ్చాం. కాని ప్రభుత్వం నిర్లక్ష్యంగా ఉండటం వలన వాళ్లు, ఇంకో గతిలేక నిరశనవ్రతం పూనారు. కాని ప్రభుత్వానికి చీమ అయినా కుట్టలేదు. ఇంతేగాక దుష్ప్రచారంకూడా చేశారు ఆరోగ్యంగా, సంతృప్తికరంగా ఉన్నారంటూ ప్రచారం. ఇది అసలే బాధపడేవారిని మరింత అవమాన పరచడం.

దేశమంతా ఐక్య కంఠంతో బెంగాల్, పంజాబ్ ఖైదీలకోసం, విడుదలను కోరి, పోరాడినది. మేము ఇందులో వెనుకపడలేము. విడుదలకై ఇంకా పోరాడతాం. మా శక్తికొలది సేవ చేస్తాం. అలాగే, మేము గర్వింపదగిన, వీరులను, కర్షక నాయకులను విడుదలను చేయమంటూ అడగడంలో దేశమంతా మాకు సహాయపడదా? అసలే ఆలస్యమైంది. ఇంకా ఆలస్యం కానీయరాదు. ఈమాత్రపు కోర్క ఏమంత ఎక్కువైనదా? మేము నిస్పృహపొందకుండా, దేశీయులందరూ ఆచరణ రూపంలో విడుదలకై ఆందోళన చేయడమే మేము కోరే సమాధానం.

జీవితగాథ

# ఖుదీరాంబోసు

కామ్రేడ్ గద్దె లింగయ్య

భారతదేశంలో వ్యాపారం నిమిత్తం చేరి అధికారం స్థాపించిన బ్రిటిష్‌వారు ఇంగ్లీషును రాజభాషనుచేశారు. ఆంగ్లవిద్యా వ్యామోహము అన్నిప్రాంతాలకన్నా బెంగాల్‌లో బాగా స్థావరం చిక్కించుకున్నది అనేకమంది ఇంగ్లీషు చదివి ప్రభుత్వోద్యోగాలు చేశారు. ఏటేటా కుక్కగొడుగుల్లాగ తయారుచేశాయి పట్టభద్రుల్ని లెక్కలేనంతమందిని. అందరికీ వుద్యోగాలెక్కడినుంచి వస్తాయి. నిరుద్యోగం ప్రబలింది. విద్యాధికులగు యువకులకు దారి తెన్నూ కన్పించింది కాదు. ఇంతకూ పరాధీనతే కారణమని గ్రహించారు. పరజాతి ప్రభుత్వం మీద ద్వేషం బలిసింది. అంతవరకూ ఆంగ్ల ప్రభుత్వానికి పరమభక్తులుగానున్న బెంగాలీలే విప్లవకారులైనారు. దేశానికెలాగైనా స్వతంత్రం సంపాదించాలని ప్రతిజ్ఞపూనేరు. ఆ ప్రతిజ్ఞా పర్యవసానంగా టెర్రరిస్టు వుద్యమం బయల్దేరింది.

ఈవిధంగా టెర్రరిస్టులు రాజకీయ చైతన్యముతో పనిచేస్తూవుంటే ప్రభుత్వం సహిస్తుందా? ఆయువక సింహములను కత్తెర బోనుల్లో బంధించ పూనుకుంది. అనేకమంది వుద్యోగులు వారి స్వాతంత్ర్యేచ్ఛ నరికట్టడానికి ఘోర శిక్షలు వేయడంలోనూ, హింసించడంలోనూ శక్తివంచన లేకుండా పనిచేశారు. టెర్రరిస్టులు అట్టి నిరంకుశాధికారులను తుదముట్టించడం కూడా ఒక సిద్ధాంతంగా పెట్టుకొని అందుమూలంగా ఎందరో ఆహూతిఅయినారు. అట్టివారిలో మన చరిత్ర నాయకుడు ఖుదీరాంబోసు ఒకడు.

ఖుదీరాం జీవితం ఏమంత పెద్దదికాదు. వయస్సుకు మించిన ధైర్యం, సాహసం, త్యాగం - అందులోనూ స్వాతంత్ర్యం కోసం బలి అవడమే అతని జీవితంలోని విశేషం.

కలకత్తా సమీపంలోని ఒక గ్రామంలో ప్రతిష్ఠకలిగిన ఒక కాయస్థ వంశానికి చెందినవాడు. 1891 సంIIలో పుట్టాడు. ప్రాథమిక విద్య పూర్తిచేసి కలకత్తాచేరి పెద్ద చదువు పూనుకున్నాడు. అప్పటికతనికి 16 ఏళ్లుంటాయి. ఆవిద్యార్థి దశలోనే టెర్రరిస్టులను కలుసుకోవడం తటస్థించినది. అతనిలో స్వాతంత్ర్య భావాలు చెలరేగినవి దాస్యశృంఖలా విచ్ఛేదనకు ఉవ్విళ్లూరిందతని మనస్సు పార్టీలో సభ్యుడుగా చేరాడు. నాయకుల ఆజ్ఞలను శిరసావహించి ఆచరించేవాడు.

1904 సంII అనంతరం బెంగాల్లో వీరేంద్ర కుమార్‌ఘోషు నాయకత్వాన టెర్రరిస్టు వుద్యమము తీవ్రరూపం దాల్చింది అనేక పత్రికలు 'యుగాంతర్,' 'సంధ్య' మొదలైనవి తీవ్ర ప్రచారం చేస్తున్నవి. అప్పుడు కలకత్తాలో జిల్లాకలెక్టరుగావున్న కింగ్స్ ఫోర్డు అను ఆంగ్లేయుడు అనేకమంది పత్రికా సంపాదకులపై కేసుపెట్టి క్రూరంగా దీర్ఘ శిక్షలు వేశాడు. ఆ మహానుభావుని కలంపోటుతో వందలకొలది దేశభక్తులు కఠిన శిక్షలకు గురి అయినారు. రాజకీయ ముద్దాయి అయితే చాలు. ఇంక బయటపడేది లేదు. నేరం చేసినా చేయకపోయినా శిక్షించి తీరేవాడు. ప్రజలకాయనంటే అసహ్యత ప్రబలింది. ఆ విధంగా ఆయన నిరంకుశ చక్రం విచ్చలవిడిగ విహరించడం టెర్రరిస్టుపార్టీ సహింపలేకపోయింది. వూరకే నిరసన తెల్పి కూర్చుండడం స్వాతంత్ర్యయోధులకు తలవంపులుగా తలంచారు. హింసకనికి ప్రతిహింసతోనే జవాబుచెప్ప నిశ్చయించుకున్నారు.

టెర్రరిస్టుపార్టీ కింగ్స్‌ఫోర్డుకు జవాబు చెప్పడానికి ఇద్దరు నవయువకులను నిర్ణయించింది. ఆ యిద్దరే ఖుదీరాంబోసు, ప్రఫుల్ల కుమారచాకీలు. ఇద్దరూవిద్యార్థులు, వుత్సాహం, వుద్రేకం గలవారు దేశానికి సర్వస్వం సమర్పింప సిద్ధముగా నున్న వీరులు. పార్టీ ఆజ్ఞకు బద్ధులయ్యారు.

ఖుదీరాము, చాకీ లిద్దరూ కింగ్స్ ఫోర్డుకు సమాధాన మిద్దామనుకుంటూండగానే అతను కలకత్తానుంచి ముజప్ఫర్ పూరుకు బదిలీ అయినాడు. పార్టీ ఆ యువకుల నిద్దరినీకూడా అక్కడికివెళ్లి కార్యం సాధించుకు రమ్మని ఆజ్ఞాపించినది.

ఇద్దరూ కుర్రవాళ్లు, ఖుదీరాంకు 17 ఏళ్లయినా నిండలేదు. అందులోనూ వారెప్పుడూ చూచైనా వుండని ముజప్ఫర్ పురం. అయినా ఆ వీర కిశోరములకు కార్యం సాధించగలమా లేదా అనే సందేహం కలుగలేదు. వుత్సాహావేశాలు వారిని ముందుకు లాగుకొని పోయినవి. ముజప్ఫర్ పూరులో ఒక ఏకాంతస్థలంలో మకాం పెట్టారు. కింగ్స్‌ఫోర్డు ఎక్కడ వున్నాడు. ఎక్కడెక్కడికి ఏ ఏ సమయంలో వెళుతూ వుంటాడు, తిరిగి వస్తూ వుంటాడు, వెంట ఎవరైనా వుంటారా మున్నగు అనేక విషయాలు తెలుసుకొన మొదలు పెట్టారు. పది పదిహేను రోజుల్లో తమకవసరమైన భోగట్టా అంతా తెలుసుకున్నారు. కింగ్స్‌ఫోర్డు ప్రతిదినమూ సాయంకాలము క్లబ్బుకు తిరిగి ఇంటికి వెళ్లే సమయములో బాంబులేసి హతమార్చుదామని ఇద్దరూ ఆలోచించుకున్నారు. కింగ్స్‌ఫోర్డు ప్రతిరోజు ఎక్కి తిరుగుతూవుండేవారు బాడీనీ రంగునూ కూడా బాగా గుర్తుపెట్టుకున్నారు.

ఈ ప్రయత్నంలో ప్రవేశించే ముందు తమ భావిస్థితినికూడా వూహించుకొనకపోలా. పట్టుబడుటే తటస్థిస్తే వురితాడు మెడకు తగుల్కోక తప్పదనుకున్నారు. యౌవ్వనంలో వున్నారు. ఇంకా వికసించని మొగ్గలకూ వారికీ భేదంలేదు. వికసించి సహజ పరిమళాన్ని వ్యాపింప చేసే పువ్వులవలె తామూ మునుముందు ఎంతో ఉపయోగపడగలం దేశానికని ఎరుగుదురు కాని దేశానికి అవసరమైనప్పుడు దోషవానికి మొగ్గలే కావాలన్నట్లు మరి బలివేదికపైకెక్కవద్దూ? అందుకు సిద్ధపడే వురికారు రంగంలోకి. 1908 సంవత్సరం ఏప్రియల్ 30 తేదీరాత్రి 8 గంటలవేళ ముజప్ఫర్‌పూర్‌లో క్లబ్బు సమీపంలో రోడ్డుప్రక్క చెట్లచాటున ఖుదీరాం-ప్రఫుల్లచాకీ లిద్దరూ కింగ్స్‌ఫోర్డు రాకకు బాంబులు చేతబట్టి ఆ గొన్న సింగముల పగిది కాచుకునివున్నారు క్లబ్‌పైవునుంచి కారు ఖుర్‌మంటూ బయల్దేరించి ఇద్దరూ ధ్వనివిని జాగరూకులై కారును మనకి చీకట్లో శ్రద్ధగా పరికించి చూచారు. అచ్చంగా అకారే. కింగ్స్‌ఫోర్డుదే. కారు దగ్గరగా వచ్చిందో రాగానే బాంబును విసిరి కొట్టారు కారుమీద. పెద్దమోత. వారు తక్షణం పరుగుతీశారు.

కాని ఖుదీరాం ప్రఫుల్లచాకీలు ఎవరిపై కక్ష తీర్చుకోవాలనుకున్నారో, ఎవరికి జవాబుచెప్పుటకు కారుమీద బాంబులేశారో ఆ వ్యక్తి మాత్రమా కారులో లేడు. పాపం అందులో ఒక ఆంగ్ల బారిష్టరు భార్య మిసెస్ కెన్నడీ. ఆమె కుమార్తె వుండిపోయారు దురదృష్టవశాత్తు. ఆ యిద్దరి ప్రాణాలు అప్పటి కప్పుడే ఎగిరిపోయాయి.

ఈ వార్త ఒక క్షణంలో పట్టణ మంతటా వ్యాపించింది. పోలీసు వుద్యోగులు వెంటనే పట్టణం అన్నివైపులా కాపలా పెట్టారు. ఆ సాయంకాలం కలెక్టరు అంగరక్షకు లిద్దరు క్లబ్‌కు సమీపంలో ఖుదీరాం - చాకీ లిద్దరూ సంచరిస్తూ వుండడం చూచారట వారా ఇద్దరి గుర్తులనుకూడా చెప్పారు సమీపంలో వున్న అన్ని స్టేషనులకూ వివరాలు తెలియజేస్తూ అనుమానం కలిగినవారిని అరెస్టుచేయమని తంతి వార్తలు పంపబడ్డాయి.

ఖుదీరాంబోసు

ఖుదీరాం- ప్రఫుల్లచాకీలు బాంబు గురి తప్పకుండా కారుపై బడుటచూచివెంటనే చెరొక ప్రక్కకూ పరుగుతీశారు. ఖుదీరాం ఆ విధంగా బయల్దేరి ఎక్కడా ఆగకుండా ముజప్ఫర్ పూరుకు 25 మైళ్ల దూరంలోవున్న వేణీ అనే వూరు చేరుకున్నాడు. తెల్లవారింది. రాత్రి భోజనంలేదు. తెల్లవార్లూ ఒకటే ప్రయాణం. ఆకలి మండుకుపోతుంది. అప్పుడు భోజనమెక్కడ దొరుకుతుంది? ఒక దుకాణానికి వెళ్లాడు సెనగపప్పు అయినా తిని నీళ్ల త్రాగుదామని.

ఆవూళ్లో రైల్వేస్టేషను వుండుటవల్ల తంతి వార్త రాత్రియే వచ్చింది ప్రయాణికులను కన్పెట్టవలసిందని. ఆవార్త విన్నవాడొకడు ఖుదీరాం శనగలు కొనుక్కుంటానికి వెళ్ళిన దుకాణంలో కొందరిని కూర్చోబెట్టి "ముజప్ఫర్ పూరులో ఎవరో బాంబు వేయడంవల్ల కారులో వెళ్తూవున్న ఇద్దరు దొరసానులు చచ్చిపోయారని వింతగా చెప్పుతున్నాడు. ఆ మాటలు ఖుదీరాం చెవినిబడినవి. అతని కాశ్చర్యము కలిగింది. తనను తాను మర్చిపోయాడు ఆమాటలు వినగానే అతని నోటినుంచి "అయితే కింగ్స్ ఫోర్డు చావలా? దొరసానులా చచ్చింది" అన్నమాటలు అప్రయత్నంగానే వెలువడ్డాయి. తెల్లవార్లూ నిద్రలేక ఎర్రబడిన కళ్ళతో చెల రేగిన జుట్టుతో, ఆకలి, నడకలతో బడలియున్న ఒక నూతన యువకుడు విచిత్రంగా అలా అనేటప్పటికి అక్కడున్నవారికి అనుమానం కలిగింది. ఖుదీరాంను పట్టుకోబోయారు. అతను జాగ్రతపడి పలాయనంచేశాడు. అతన్ని ప్రభుత్వానికి పట్టిస్తే బహుమతి పొందవచ్చుననే ఆశతో కొందరు నీచులు వెంబడించారు. ఇంతలో పోలీసు స్టేషనుకు కబురు తెలిసింది. పోలీసులుకూడా వెంబడించారు. ఏ ప్రజారాజ్యం కొరకు ఖుదీరాం సర్వం సమర్పణ చేయడానికి సంసిద్ధుడైనాడో ఆప్రజలే అతన్ని ముప్పులో ముంచారు. ముందు అతనూ వెనుక పోలీసులూ పరుగెత్తుతున్నారు. 17 ఏళ్లబాలుడు ప్రయాణ బడలిక, ఆకలి మంటలచే పీడింపబడి శనగగింజలకోసం దేవులాడబోయిన ఖుదీరాం పోలీసులు తరుముతూవుంటే వారికందకుండా మూడు మైళ్లదూరం పర్వెత్తినాడు. కాని ఇంక ఆపైన అడుగువేయుటకు ఓపికలేదు. వెంబడించిన వారిలోకూడా ముగ్గురుమాత్రమే మిగిలారు. అప్పుడతనివద్ద తోటాలునింపిన రివాల్వరు ఒకటివున్నది. మరి ముప్పైతోటాలు కూడా వున్నై. కాని వృథా ప్రాణము తీయడానికతని మనస్సు ఒప్పలా. తాను పారిపోయేశక్తి లేనప్పుడు శత్రువులువచ్చి పట్టుకోబోతూవున్నా కూడా అతను కాల్చదలచలేదు. రివాల్వరు చూపించి వారిని బెదరించాలని ప్రయత్నం చేశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. పట్టుబడినాడు.

అతడు వెంటనే వేణీనుంచి ముజప్ఫర్ పూరుకు రైలులో పంపబడ్డాడు. బాంబువేసిన యువకుడు పట్టుబడినాడు. అతను రైలుకు తీసుకొని వెళ్లబడుతున్నవార్త కూడా అందరికీ తెలిసిపోయింది. స్టేషనుకు గుంపులు గుంపులుగావెళ్లి చూచారు. ఖుదీరాం ముఖంమీద చిరునవ్వు తొలుకాడుతోంది. అతనే అంతపని చేసి వుంటాడాఅని సందేహం కలిగింది ప్రజాసామాన్యానికి.

కోర్టులో కేసు విచారణకు పెట్టారు. అది 1908 సంవత్సరము ఇప్పటిలాగా ఇష్టమొచ్చినచోట త్రివర్ణపతాకం ఎగిరే రోజులు కావవి. వందేమాతరం అంటేచాలు ఫెదేల్‌మని తగిలేవి కొరడాదెబ్బలు. అట్టిలాంటి దినాల్లో బాంబు వేయడం సామ్రాజ్యవాద దృష్టిలో ఎంత ఘోరాపరాధం. ఆ అపరాధానికి ఒక్కటే శిక్ష, వురి. దేశంలో వేలు—లక్షలుగా వున్నారు, వకీళ్ళు. కాంగ్రెసు అసలు ప్లీడర్లపుట్టే, అయితే ఏం ఖుదీరాం పక్షంపూని వాదించడానికి ప్రతివాడికీ భయమే. ఏ పేదరైతుల్లోనో కూలివాళ్ళలోనో వున్నవీ లేనివీ కల్పించి చెప్పి,ఆశపెట్టి, ద్వేషాలుపెంచి చివరికి వాళ్ళకు తిరపతి క్షౌరము అయినా, తాముమాత్రం వకాలతుఫీజు గుంజుకోవడంలో నేర్పు, తెలివితేటలూ ప్రదర్శిస్తారు. గాని ఖుదీరాం వంటివాని తరపున వాదించడానికెందుకు సిద్ధపడతారు? పెద్ద పెద్ద వారని పేరే గాని ఎవడూ అంగీకరించలేదు. తుదకు కాళిదాసబోసు అనే ఆయనమాత్రం సంసిద్ధమైనాడు. కాని అసలు వకీలుకు పనేలేకుండా చేశాడు, ఖుదీరాం. అతను స్వయంగా బాంబువేసినట్లు అంగీకరించాడు. అంటే మృత్యువును ఆహ్వానించడమే. పదిహేడేళ్ళ బాలునికి నిర్దాక్షిణ్యంగా వురిశిక్ష విధించ బడినది. ఖుదీరాం బాంబు ప్రయోగము కోర్టులో మహాపరాధముగా పరిగణించ బడినా, లోకమాన్యుడు మాత్రము సమర్థించాడు. ప్రజలను హింసించు నిరంకుశాధికారులను హతమార్చుట సబబేనని బాలగంగా

(మిగతా 16 వ పేజీలో)

సంపుటం 2 **నవశక్తి** బుధవారం
సంచిక ఏ6 23-8-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు), కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య, తుమ్మల వెంకట రామయ్య.

## జాతీయ సమర సప్తాహం

సోషలిస్టులు, కమ్యూనిస్టులు, తీవ్రజాతీయవాదులు అంతా జాతీయ సమర సన్నాహానికి సమయ మాసన్నమయిందని, కాంగ్రెసు మహాసంస్థ సామ్రాజ్యవ్యతిరేక శక్తులన్నింటికి నాయకత్వము వహించి బ్రిటీషు ప్రభుత్వంతో అంతిమ పోరాటానికి దారి తీయాలని ఎలుగెత్తి చాటారు: కాని కాంగ్రెసులో అధికారములో వున్న హైకమాండు చెవి బెట్టలేదు. ఆసేతు హిమాచలపర్యంతము మారుమూలల నున్న స్వదేశీ సంస్థానాలలో సైతము పౌరసత్వ హక్కుల కొరకు, బాధ్యతాయుత ప్రభుత్వము కొరకు వెల్వడిన సంస్థాన ప్రజాపోరాటాలు సమీకరణ మొనర్పగల కాంగ్రెసు పూనుకొనక పోవుటచే చల్లారి పోతున్నాయి. బ్రిటీషు సామ్రాజ్యవాదుల సహాయముతో నరేంద్రులు ప్రజా ఉద్యమాలను అణిచేస్తున్నారు. బ్రిటీషు యిండియాలో బయలుదేరిన కార్మిక, కర్షక ప్రజాసామాన్య ఉద్యమాలకు కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రోత్సాహ మివ్వక సామ్రాజ్యవాదులచే నిర్మించ బడిన నిర్బంధ శాసనాలతో అణచి వేస్తున్నారు. ప్రజాపోరాటాలకు దోహద మొసగి సంపూర్ణ స్వాతంత్ర్యోద్యమాన్ని పెంపొందించడానికి వినియోగించుటకు కాంగ్రెసు మహాసభచే అంగీకరించబడిన పదవీస్వీకరణ తద్వ్యతిరేకముగా ప్రజా ఉద్యమాలను అణచి వేయడానికే వినియోగించ బడుతోంది. కాంగ్రెసు నాయకత్వము పోరాట కార్యక్రమము వదలివేసి, 'కాంస్టిట్యూషనల్' విధానమువైపు మ్రొగ్గింది. బానిస రాజ్యాంగ విధానాన్ని నాశనము చేయుట మరచి, దానిని అచరణలో పెట్టుటకే కాంగ్రెసు నాయకత్వం ఉవ్విళ్లూరుతూంది.

తీవ్రవాదులు బ్రిటీషు సామ్రాజ్యవాదంతో పోరాటం గావాలని కోరుతూంటే, కాంగ్రెసులో అధికారములోవున్న గాంధీయులు, తీవ్రవాదులపైనే యుద్ధం ప్రకటించారు. కాంగ్రెసునుండి వారిని తరిమివేయడానికి పూనుకొన్నారు. అనేక జాతీయ పోరాటాలలో పాల్గొన్న కాంగ్రెసువాదులు బయటికి నెట్టివేయబడుతున్నారు. బోసుపై చర్యతో తీవ్రమయిన యీ విధానము వివిధ రాష్ట్రాలలో తీవ్రవాదులందరిని కాంగ్రెసు నుండి తరిమివేసే దాకా ఆగే సూచనలు కాన్పించడములేదు. బీహారులో, సరిహద్దు, మధ్య రాష్ట్రాలలో, కాంగ్రెసు ప్రభుత్వము కిసాన్ ఉద్యమాన్ని పోలీసు నిరంకుశత్వము ద్వారా అణచివేస్తూంది. బొంబాయిలో కార్మిక నాయకులపై కేసులు పెట్టబడ్డాయి. సంయుక్త రాష్ట్రంలో కమ్యూనిస్టులపై కేసులు పెట్టమని కాంగ్రెసు ప్రభుత్వము సర్క్యులరు పంపింది. మద్రాసు రాష్ట్రములో కార్మిక, రైతు పోరాటాలలో నిర్బంధ చర్యలు సాగాయి. బెంగాలు, పంజాబు రాజకీయ ఖైదీల విడుదలకొరకు ప్రజా ఉద్యమాన్ని లేవదీయడానికి పూనుకోక పోగా వర్కింగు కమిటీ 'నిరశన వ్రతము ఆర్డర్లీ ప్రభుత్వ నిర్వాహణకు' అభ్యంతరమని నిరశించింది.

త్రిపురీ కాంగ్రెసు మహాసభ ప్యాసుచేసిన జాతీయ వాంఛా తీర్మానము ప్రకారము స్వాతంత్ర్య పోరాటానికి సన్నాహాలు చేయడానికి కాంగ్రెసు నాయకత్వము ప్రయత్నించనేలేదు. అందుచే గత్యంతరములేక సోషలిస్టులు, కమ్యూనిస్టులు, ఫార్వర్డుబ్లాక్, కిసాన్ నాయకులు కలసిన తీవ్రవాద సమ్మేళన సంఘము స్వయముగా కాంగ్రెసు మహాసభ తీర్మానాన్ని అమలు జరుపపూనుకొంది. క్రిందటి వారము కలకత్తాలో జరిగిన సమావేశములో ఈ నెల 31 వ తేదీనుండి సెప్టెంబరు 6 వ తేదీ వరకు జాతీయ సమర సప్తాహము జరుపాలని తీర్మానించింది. దీనిని మితవాద కాంగ్రెసు వాదులు తమకు పోటీగా తలచరాదు. త్రిపురీ కాంగ్రెసు మహాసభ చేసిన జాతీయ వాంఛా తీర్మానము ప్రకారము తాము బ్రిటీషు సామ్రాజ్యముతో పోరాటము కొరకు దేశాన్ని తయారు చేయాలనే కర్తవ్యాన్ని గుర్తించి యీ ఉత్సవాలలో పాల్గొనాలి. వర్కింగు కమిటీ చేసిన యుద్ధ వ్యతిరేక తీర్మానము ప్రకారము నిజముగా "బ్రిటనుతో చావు బ్రతుకుల" పోరాటానికి తయారయితే గాంధీయులంతా యీ జాతీయ సమరవారాన్ని జయప్రదము కావించడానికి తోడ్పడాలి.

ఒక్కొక్క రోజు ప్రత్యేక కార్యక్రమము నిర్ణయించ బడింది. అగష్టు 31 రాజకీయ ఖైదీల విడుదల, పౌరసత్వ హక్కుల వాంఛ: సెప్టెంబరు 1 కార్మికుల, రైతుల వాంఛలు: 2 వ తేదీ యుద్ధ నిరోధము: 3 వ తేదీ ఫెడరేషను ప్రతిఘటన: 4 వ తేదీ విదేశ వస్త్ర, బ్రిటీషు వస్తు బహిష్కారము: 5 వ తేదీ సంస్థాన ప్రజల వాంఛలు: 6 వ తేదీ జాతీయ వాంఛ, జాతీయ ఐక్యత.

ఇవన్నీ కాంగ్రెసు మహాసభ అంగీకరించినవే. కాంగ్రెసు తీర్మానాలను ఆచరణలో పెట్టుట, ప్రజలలో ప్రచారము చేయుట, కాంగ్రెసు వాదుల కర్తవ్యము కదా! అందుచే యీ కార్యక్రమాన్ని జయప్రదము గావించడానికి తోడ్పడాలని కాంగ్రెసు వాదులందరిని మరొకసారి కోరుతున్నాము. గాంధీయులను కాంగ్రెసు పోరాట కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికి పోటీ పడదామని తీవ్రవాదులము సవాలు చేస్తున్నాము. వారి కాంగ్రెసు భక్తి, స్వాతంత్ర్యేచ్ఛ దేశాన్ని జయప్రదమయే అంతిమ పోరాటానికి తయారు చేయుటలో రుజువు కావాలని మనవి చేస్తున్నాము.

ఆంధ్రదేశములో నెల్లూరు, గుంటూరు, కృష్ణా పశ్చిమ గోదావరి జిల్లాలలో సోషలిష్టులు యిదివరకే జాతీయ వాంఛా తీర్మానాన్ని గురించి కొంతవరకు ప్రచారముగావించారు. ఇపుడు ఆంధ్రదేశమంతటా తీవ్రవాదులంతా కలసి యీ జాతీయ సమర సప్తాహాన్ని జయప్రదంగా జరపాలి. దిగజారుడు పాలసీ బురదలో యిరుక్కుపోయిన నాయకమన్యులు రాకపోయినా, సామాన్య కాంగ్రెసు వాదులందరినీ, సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్షితులందరినీ యీ కార్యక్రమములో పాల్గొనేటట్లు చెయ్యాలి. జాతీయ వాంఛా తీర్మాన ఆచరణకు ఇదెలా అవసరమో వారికి నచ్చచెప్పాలి. గాంధీయుల నాయకత్వానికి పోటీగా కాక, రాబోవు యుద్ధ సమయములో బ్రిటీషు ప్రభుత్వ దాడిని ఎదుర్కోడానికి, ఫెడరేషను అమలు జరగకుండా చేయడానికి, పోరాటానికి దేశాన్ని తయారు జేయడానికి యీ వారములో ఉత్సవాలు, ఊరేగింపులు, సభలు, ఉపన్యాసాలని తెలియ జెప్పాలి. తీవ్రవాదులందరిచే ఐక్యతతో చేయబడుచున్న యీ జాతీయ సమర సప్తాహం ప్రజలలో నివురు గప్పివున్న స్వాతంత్రేచ్ఛను రగుల్కొల్పుతుందని ఆశింపుతాము. తీవ్రవాదులందరి ఐక్యత కాంగ్రెసు ఐక్యతకు—జాతీయఐక్యతకు దారితీస్తుందని అభిలషించుతున్నాము. ఏమంటే జాతీయ ఐక్య సంఘటన ద్వారానే జయప్రదమైన స్వాతంత్ర్య పోరాటాన్ని నడుపగల్గుతాము. సంపూర్ణ స్వాతంత్ర్య ఆశయాన్ని వెంటనే సాధించగల్గుతాము. రానున్న ప్రపంచ సంగ్రామంలో వచ్చే సదవకాశాన్ని చక్కగా వినియోగించుకొన గల్గుతాము.

మన నినాదాలు:—

రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి।

పౌరసత్వ హక్కులు కాపాడాలి।

ఎన్నిక ప్రణాళికలోని కార్మిక కర్షక హక్కులు నెరవేర్చాలి।

బ్రిటీషు వస్తువుల బహిష్కరించాలి।

సంస్థాన ప్రజా పోరాటాన్ని బలపరచాలి।

యుద్ధ అవకాశాన్ని వినియోగించుకోవాలి।

ఫెడరేషను వ్యతిరేకించాలి।

కాంగ్రెసు ఐక్యతను కాపాడాలి।

# మన రాజకీయాలు

### ప్రజలకు యదార్థమేదో తెలియజేయాలి.

అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ తీర్మానము ప్యాసయిన తర్వాత ఎసోసియేటెడ్ ప్రెస్ ఒక వార్త ప్రకటించింది. ఇండియా ప్రభుత్వం మన సైనికుల్ని విదేశాలకు పంపకపూర్వము అన్ని ఎసంబ్లీపార్టీల నాయకులకూ ఆయారాష్ట్రగవర్నర్లద్వారా యీవిషయం తెలియజేయబడినదనీ; సిమ్లాలో అప్పుడు ఉన్న ఒక పార్టీ నాయకునికి వైస్రాయి స్వయంగా చెప్పాడనీ— ఆ వార్త తెలియజేస్తోంది.

ఏ యే పార్టీ నాయకులకు యీవర్తమానం తెలియజేయబడింది? సిమ్లాలో ఉండి వైస్రాయితో సంభాషణ జరిపిన పార్టీ నాయకుడెవరు? కాంగ్రెస్ పార్టీ లీడర్ (భులాభాయిదేశాయి). డిప్యూటీ లీడర్ (సత్యమూర్తి). యేమని జవాబిచ్చారు? మొదలయిన ప్రశ్నలు వెంబనే రాక మానవు. బెంగాల్ ఎసంబ్లీ కాంగ్రెసు పార్టీ నాయకుడయిన శరత్‌చంద్రబోసు పత్రికా ముఖంలో యీ ప్రశ్నలే అడుగుతున్నాడు.

1937 లో ఇండియా ప్రభుత్వము యీ మాదిరిగానే చైనాకు మన సైనికుల్ని పంపినప్పుడు కాంగ్రెస్ పార్టీ నాయకు లిద్దరూ ఎసంబ్లీలో ప్రభుత్వానికి సహాయంచేయడమువల్ల యీనాడు యీ సందేహము యెవరికైనా కలగడములో ఆశ్చర్యములేదు. కాబట్టి శరత్ బోసు అడుగుతూన్న ప్రశ్నలకు దేశాయి, సత్యమూర్తి గారలు తక్షణమే జవాబిచ్చి, ప్రజలకు యదార్థాన్ని తెలియజేసి, సందేహ నివారణ చేయవలసిందని కోరుతున్నాము.

### సత్యమూర్తి సలహా ఫలించింది!

ఎసెంబ్లీ కాంగ్రెసు నాయకులు యిట్టి సందేహాలకు అవకాశమిస్తూంటే, మరొక వైపున సంస్థానాధీశులు ఫెడరేషన్ యెడల తమ ప్రాతికూల్య వైఖరిని విడనాడి, గ్రేట్ బ్రిటన్ యొక్క ఆపత్సమయంలో సహాయము చేయాలని మొన్న ఢిల్లీలో తీర్మానించుకొన్నారు. సామ్రాజ్యవాదుల పతకము యీ విధముగా అన్నివైపులా పారుతోంది. ఫెడరేషన్‌ని ప్రతిఘటించవద్దని సంస్థానాధీశులకు సత్యమూర్తి యిచ్చిన సలహా ఫలించింది: ఇక కాంగ్రెస్ నాయకులు, సంస్థానాధీశులు, ఫెడరేషన్ విషయంలో బేరాలు ప్రారంభిస్తారు కాబోలు!

### సంస్థానాల వ్యవహారం

సంస్థానాల వ్యవహారము ఎలా వుందో చూదాం. నైజాం ప్రభుత్వము రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయడము ప్రారంభించింది. వెంటనే గాంధీగారు, రాజేంద్రప్రసాదు, సత్యమూర్తి వగయిరా నాయకులు ఆర్యన్ సత్యాగ్రహనాయకుల్నీ, నైజాము ప్రభుత్వాన్నీ అభినందిస్తూ, సత్యాగ్రహుల విజయానికి సంతోషము తెలియజేస్తూ సందేశాలు పంపుతూ వచ్చారు.

కాంగ్రెసు నాయకత్వముక్రింద హైదరాబాద్ సంస్థానములో ప్రారంభమైన సత్యాగ్రహ పోరాటాన్ని తాము ఆపివేసి, యితర మతసంస్థల యాజమాన్యాన బ్రహ్మాండమైన ప్రజా పోరాటము సాగుతూంటే మాట్లాడక ఊరుకున్న కాంగ్రెసు నాయకులు నేడు అభినందన పరంపరలు కురిపిస్తున్నారే గాని, హైదరాబాద్ స్టేటు కాంగ్రెసు బలహీన పడినందుకు విచారించడములేదు.

ఇక మైసూర్ స్టేట్ కాంగ్రెసు నాయకులైన దాసప్ప, వగైరా పదముగ్గురు కలిసి కోలార్ బంగారు గనుల వద్ద ఉపన్యసించబోతే, వారిమీద నిషేధపు టుత్తరువు జారీ చేయబడింది. వారందరూ నిషిద్ధప్రదేశములో ప్రవేశించి ఉత్తరువును ఉల్లంఘించారు. పోలీసులు వారందరినీ ఎరస్టుచేసి కేసు పెట్టారు. ఒక్కొక్కరికి మూడేసి నెలల కఠినశిక్ష విధించబడింది.

బాధ్యతాయుత ప్రభుత్వముకొరకు ప్రజలలో ప్రచారము కూడా చేసుకోనివ్వకుండా కాంగ్రెసు వాదులపై యిట్టి నిర్బంధ విధానాన్ని సాగిస్తూన్న మైసూర్ సంస్థాన ప్రభుత్వ చర్యలను గాంధీ మహాత్ముడుగాని, రాజేంద్ర ప్రసాద్‌గాని, సత్యమూర్తిగాని, ఎందుకు ఖండించరో?

### పౌరసత్వపు హక్కులకు సంకెళ్లు.

సీ. పీ. రాష్ట్రీయ స్వపరిపాలన వొచ్చేసిందని గర్వించే కాంగ్రెసు మంత్రుల హయాములో పరిస్థితు లెలావున్నాయో చూదాం.

బీహార్ కాంగ్రెసు ప్రభుత్వము పాట్నాలో ఒక మిలిటరీ శిక్షణ శిబిరము యేర్పాటు చేస్తే, వైస్రాయి అనుమతినివ్వలేదు. ఇదేవిధముగా, కాన్పూరుజిల్లా అంతటా పల్లెటూళ్ళలో పిల్లలకు మిలిటరీ డ్రిల్లు నేర్పే విద్యాలయాలకు యు. పి. కాంగ్రెసు ప్రభుత్వము అనుమతి యిచ్చినప్పటికీ, మిలిటరీ అధికారులు నిరాకరించారు. సుప్రసిద్ధ కార్మిక నాయకులైన డాంగే ప్రభృతులు 6 గురిని దౌర్జన్యప్రోత్సాహ నేరముక్రింద బొంబాయి పోలీసులు ఎరస్టు చేశారు. బెనారస్‌లో 'ఆజాదీ' అనే అతివాద కాంగ్రెసు పత్రికకు సంపాదకుడును, పబ్లిషర్‌ను, అయిన కృపాశంకర శర్మగారు "యిదివరలో గడిపిన రాజకీయ జీవితము, యిప్పుడు ఆయనతో కలసి మెలసి తిరుగుతూన్న వ్యక్తులు" బెనారసు జిల్లా మేజస్ట్రేటు దృష్టిలో సరియైన వారు కాకపోవడమువల్ల ఆ పత్రిక రు. 500 ల సెక్యూరిటీ చెల్లించాలని ఉత్తరువు! కాన్పూరులో మత వైషమ్యాలు యింకా అంతరించ నందున, "పారిశ్రామిక స్థితిగతులుకూడా తారుమారుగా ఉండడాన్ని బట్టి" 144 వ సెక్షన్ మరో రెండు నెలలకు పొడిగిస్తూ జిల్లా కలెక్టరు ఉత్తరువు జారీ చేశాడు. అబోట్టాబాద్ (సరిహద్దు) లో జమీందార్ల సభకు కొందరు రైతులుకూడా హాజరయి, జమీందార్ల ఉపన్యాసాలు గిట్టక తిరుగ బడ్డారట! వెంటనే పోలీసులు వచ్చి తుపాకులు కాల్చారు, ఒకడు చనిపోయాడు; చాలా మందికి గాయాలు తగిలాయి.

కాంగ్రెసు మంత్రులు అధికారములో ఉన్న రాష్ట్రాలలోనే యిట్టి దారుణాలు జరుగుతూంటే, "నేషనల్ ఫ్రంటు" పత్రికయొక్క జూలై 30, ఆగష్టు 6, తేదీల సంచికలు బెంగాలు ప్రభుత్వముచే నిషేధించబడినవంటేగాని; ఢిల్లీ ప్రభుత్వము సత్యవతీదేవి అనే కాంగ్రెసు నాయకురాలిని జామీన్ సెక్షన్‌క్రింద ఎరస్టు చేయించిందంటేగాని; రాజద్రోహ నేరముక్రింద ఈశ్వరదత్తు అనే కాంగ్రెసు నాయకుణ్ణి పంజాబు ప్రభుత్వము ఎరస్టు చేయించిందంటేగాని; లాహోరులో కొత్తగా విధించబడిన యింటి పన్నుకు వ్యతిరేకముగా కాంగ్రెసు, ముస్లిములీగ్, అహ్రార్ నాయకుల యాజమాన్యాన బ్రహ్మాండమయిన ఊరేగింపు జరుగుతూంటే పోలీసులు లాఠీలతో క్రూరముగా హింసించారంటేగాని ఆశ్చర్యము ఎందుకు కలుగుతుంది?

### యు. పి. మితవాదుల సంరంభము.

కొన్నిచోట్ల మితవాదుల వైఖరి విచిత్రముగా ఉంది. యు. పి. రాష్ట్రములో మితవాద కాంగ్రెసు నాయకులంతా కలిసి "గాంధీ బ్లాక్" ఒకటి స్థాపించారు. ఈ సంస్థలో చేరిన సభ్యులు "కాంగ్రెసు వాదు" లని పేరు పెట్టుకొన్నారు. గాంధీగారి నాయకత్వము క్రింద, కొద్ది రోజుల్లో వీరు, "అంతిమ స్వరాజ్య పోరాటము" సాగించడానికి సన్నాహాలు చేస్తారట. కాంగ్రెసు తప్ప ఏయితర మత సంస్థలోగాని, రాజకీయ సంస్థలోగాని, సభ్యులు కాని వారినే తమ కూటములో చేర్చుకుంటారట.

ఏ సంస్థయొక్క సభ్యులు ఆ సంస్థయొక్క రూల్సు చేసుకోడానికి హక్కు ఉన్నమాట వాస్తవమే. కాని, తాము మాత్రమే "కాంగ్రెసు వాదుల"మనీ, యితర ప్రజా సంస్థలలో సభ్యులుగా ఉన్న కాంగ్రెసువాదులు కాంగ్రెసు వాదులే కారనీ, ప్రచారానికి పూనుకోవడము "సత్య" సంధత అనిపించుకోదు. వీరి నాయకుడయిన గాంధీగారే స్వరాజ్య పోరాటానికి దేశము నేడు తగియుండలేదనీ, యిప్పట్లో పోరాటము సంభవించదనీ, పదే పదే చెప్పుతూన్నప్పటికీ, శిష్యులు మాత్రము మరో విధముగా ఆలోచిస్తున్నారు! కాని గురువుగారి నాయకత్వము క్రిందనే పోరాటము సాగాలి, వారి అభిప్రాయ ప్రకారము. దీనికి అర్థము, స్వరాజ పోరాటమూ రాదు, గాంధీగారు దానికి నాయకత్వమూ వహించరు! యిక పోరాడటానికీ అణచివేయడానికీ అతివాదులు మాత్రం మిగిలారు!

### బ్రహ్మయ్యగారి సర్క్యులర్.

ఆంధ్రరాష్ట్రము మాత్రము యిట్టి "అంతిమ పోరాటము"లో వెనుకంజ వేయదు! సుభాష్ బోసుగారికి యివ్వబడే సన్మానాలలో ఏ యెన్నిక కాంగ్రెసుసభ్యుడు పాల్గొన కూడదని తమ అధీన సంఘాలకు బ్రహ్మయ్యగారొక సర్క్యులర్ పంపారు.

రాజకీయ సిద్ధాంతాలలో అనేక భేదాభిప్రాయాలుండవచ్చు. అంత మాత్రంచేత ఒక కాంగ్రెసువాది మరొకాంగ్రెసు వాదికి సన్మాన మివ్వకూడదని ఆంక్ష విధించడము సామాన్య మర్యాదకు కూడా విరుద్ధము. సుభాష్ బోసు, ఎన్నిక కాంగ్రెసు సంస్థలలో సభ్యుడుగా ఉండకూడదని వర్కింగు కమిటీ తీర్మానించిందేగాని, సాధారణ సభ్యుడుగా ఉండకూడదని తీర్మానించలేదే! "యీతడు (బోసు) దేశానికి శత్రువు మాత్రముకాదు" అని గాంధీగారు సహితం చెప్పియున్నాడే! అయినప్పటికీ, మన నాయకులకివన్నీ అక్కర్లేదు! వర్కింగ్ కమిటీ ఒక రాయి విసిరింది, ఇక ఉన్న వారంతా తలొక రాయి విసరవలసిందే! ఈ నీచత్వం మితవాదుల్లో ఎప్పుడు పోతుందో కదా!



# తప్పటడుగులు — వెక్కిరింతలు

రాజేంద్రబాబు, గాంధి మహాత్ముడూ, ఖైదీలు ఉపవాసం మానితే విడుదల కొరకై బ్రహ్మాండము అంతా తలక్రిందు చేస్తామని అభయహస్త మిచ్చారు. తీరా అఖిలభారత వర్కింగు కమిటీలో చేసిన తీర్మానము ఏమిటి? బెంగాల్, పంజాబు ప్రభుత్వాలకు రాజకీయఖైదీలను విడుదల చేయాలంటూ ఒక ప్రార్థన పారవేసింది వర్కింగుకమిటీ. విడుదలకోసంఉపవాసం చేయుట నేరమనీ, అలా చేస్తే 'ఆర్డర్ల గవర్నమెంటు' సాగడం అసాధ్యమనీ తీర్మానించడం వార్ధా వర్కింగు కమిటీ చేసిన ఘనకార్యాలలో ఒకటి.

శిష్యుల ఉద్దండత మహాత్మని సంతృప్తి పఱచలేదు కాబోలు! ఈ వారపు హరిజన్‌లో ఇలా వ్రాశాడు.

"నిరశనవ్రతం ప్లేగువలే వ్యాపించుతూంది"..... "ఒక ఖైదీ నిరశనవ్రతం ద్వారా చావాలని నిర్ణయించుకొంటే నా అభిప్రాయము అలా చావనియ్యాలసిందే."

"కొంతమంది ఖైదీలు నిరశనవ్రతము చేస్తున్నామనే కీర్తికొరకు చేస్తూ, బలవంతముగా ఆహారము పెట్టడాన్ని అపేక్షింతురని నాకు తెలుసు. బలవంతముగా ఆహారాన్ని యివ్వడము ఆపితే నిరశనవ్రతులు విరమిస్తారని జైలర్లు నాకు చెప్పారు."

"బహిరంగమైన, లేక రాజకీయ నిరశనవ్రతము అనుమతిలేకుండా చేయడము డిసిప్లిన్‌కు వ్యతిరేకమని వర్కింగు కమిటీ నిర్ణయించాలిసింది."

దక్షిణాఫ్రికా జైల్లో జావలో పంచదారకోసం నిరశన వ్రతము బూనిన గాంధీజీ యిలా వ్రాయడం ఎంత ఆశ్చర్యకరం!

* * *

బీహారులో, బ్రిటీషు సామ్రాజ్య ఛత్రపు నీడను జమీందారుల కౌగలింతలలో ప్రభుత్వం అధికారము తమదే అనుకొంటున్న గాంధీయుల మంత్రివర్గానికి నిరశన వ్రత ప్లేగు చాలా యిబ్బందులు కల్గించుతూంది. ఆ మొవటి రైతు ఖైదీలు తమను రాజకీయ ఖైదీలుగా పరిగణించమని నిరాహారదీక్ష పూనుతున్నారు. అందుచే "ప్లేగు క్రిమివ్యాపితమైన జోహన్సుబర్గు పట్టణాన్ని తగుల పెట్టినట్లు" నిరశనవ్రత దీక్షితులను ప్రభుత్వం చావనియ్యాలిసిందే; చావక పోతే డిసిప్లినరీ కత్తితో చంపాలిసిందే!!

ఆర్డర్లీ (సక్రమ) గవర్నమెంటు! ఖైదీలు! ఈ ఆర్డర్లి ప్రభుత్వాన్ని నాశనము గావించడానికి కాదూ కాంగ్రెసు 50 సంవత్సరాలనుండి పోరాడుతుంది? వేలకొలది వీరాగ్రేసరులు ప్రాణాలర్పించింది దీన్ని కాపాడటానికేనా? పూజ్య జతీంద్రనాధుడు, ఆత్మార్పణము గావించి కాలగర్భములో కలిసి పోయింది, కాంగ్రెసు నిరాహారదీక్షను నేరముగా నిర్ణయించుటకేనా? ఛాయను గాంచి వస్తువని భ్రమించి, "పోరాటము లేకుండానే క్రమముగా స్వరాజ్యము వస్తుంది, "పోరాటము లేకుండానే క్రమంగా స్వరాజ్యముగా సుస్థిరముగావుంటుంది" అని ఒక విధముగా స్వరాజ్యము వచ్చినటులే మురిపిస్తున్న గాంధీయులకు, తమ జీవితాలు దేశము కొరకు అర్పించి, ఏండ్ల తరబడి జైళ్లలో మ్రగ్గుచున్న వీరులు విడుదల కొరకై నిరాహారదీక్ష బూనటం నేరముగా కన్పిస్తోంది.

గాంధిగారిని రాజకోటలో నిరశనవ్రతము పూనమని ప్రోత్సహించింది, "అంతర్వాణి"! కాని తక్కిన రాజకీయ ఖైదీలను నిరశన వ్రతానికి ప్రోత్సాహించింది. 'కీర్తికాంక్ష'!

* * *

భారత సైన్యాలను విదేశాలకు పంపుతూన్నందుకు అసమ్మతిగా సెంట్రల్ అశెంబ్లీ, యీ సెషను బహిష్కరించాలని వర్కింగు కమిటీ తీర్మానించింది. ఒక వైపు రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు యుద్ధ ప్రయత్నాలకు సహకారము చేస్తూ వుంటే, అపూనే యెత్తకుండా సెంట్రల్ ఎసెంబ్లీ బహిష్కరణ - యీ సెషనుకే సుమా - అని తీర్మానించడము 'స్టంటు' కాకపోతే మరేమిటి? బోసుపై చర్యకు దేశములో ప్రజలలో వచ్చే అసంతృప్తిని, తట్టుకోడానికి, తమ నేరాన్ని కప్పి పుచ్చుకోడానికి యిదొక కుంభకోణము! లేకపోతే నెల రోజులక్రితము పోరాటానికి దేశము తయారుగా లేదన్న హైకమాండ్‌లో యింతలోనే హృదయ పరివర్తనము కలిగిందా? కలకత్తాలో బోసు అధ్యక్ష పదవికి రాజీనామా యిచ్చినపుడూ రెండు ముఖ్యమైన తీర్మానాలు యుద్ధాన్ని గురించి, రాజకీయ ఖైదీలను గురించి చేసింది. కాని వాటిని ఆచరణలో పెట్టడానికి 'హైకమాండు' యీషణ్మాత్రమైనా ప్రయత్నించలేదు. త్రిపురీలో ప్యాసైన జాతీయ వాంఛా తీర్మానము ప్రకారము దేశాన్ని పోరాటానికి తయారు జేయడానికి గాంధీయులు వేవి మెదల్పలేదు.

నేడు ఆకస్మికముగా "బ్రిటీషు సామ్రాజ్యముతో చావు బ్రదుకుల సమరములో వున్నా" మనడము ఎంత హాస్యాస్పదముగా వుంది? గాంధీయులు కోరుతూంది, చేస్తుంది సమరము బ్రిటీషు సామ్రాజ్య వాదులతోకాదు: తీవ్రవాదులతో మాత్రమే. ఈ సమరములో తమ అధికారము వినియోగించి లెఫ్టిస్టులకు 'చావు' రైటిష్టులకు 'బ్రతుకు' ప్రసాదించ పూనుకొన్నారు. తీవ్రవాదులను కాంగ్రెసు నుండి బయటికి తరిమి, బ్రిటీషు ప్రభుత్వముతో ఫెడరేషను, యుద్ధము విషయాలలో రాజీపడటానికి సిద్ధముగా కూర్చున్నారు.

* * *

భారత దేశంనుండి సైన్యాలను బయటికి పంపడానికి నిజంగా హై కమాండు వ్యతిరేకమేనా? అయితే చీనాకు భారత సైన్యాలను పంపినపుడు ఢిల్లీ అసెంబ్లీ కాంగ్రెసు పార్టీ నాయకుడు, భులాభాయిదేశాయిని ఉపనాయకుడు సత్యమూర్తిని, వైస్రాయి జేరబిలిచి తమతో మంతనములాడినంత మాత్రాన తలలూపి నందులకు వారిపై ఎందుకు చర్య గైకొనలేదు? కనీసం ఆ బుద్ధి తక్కువ పని కాంగ్రెసు పాలసీకి విరుద్ధమని ఎందుకు ప్రకటించలేదు? ఇంతకూ హైకమాండు కోరేది ఏమిటి? వెనుకటివలె తమతో సంప్రదించితే సంతృప్తి పడతారా? ఏమంటే కాంగ్రెసు పార్టీ నాయకులతో సంప్రదించ సందుకు ఆంగ్లో ఇండి యన్ పత్రికలు కూడా వైస్రాయిని కోప్పడ్డాయిలెండి!

* * *

తీరా సిమ్లా నుండి అసోసియేటెడు ప్రెస్ వార్త ఏమంటే, "అన్ని పార్టీల నాయకులు సరఫరా గురించి తెలియజేయబడ్డారు." తమకు తెలిస్తే పార్టీ నాయకులు తంద్లు నులుముకుంటూ యింతకాలము ఎందుకూరుకున్నారు? 'మౌనం అంగీకార సూచకమా'? భారత ప్రభుత్వము సైన్యాలను ఈజిప్టు, మలయా, సింగపూర్‌లకు పంపుటకూడా భారతదేశ రక్షణకే నంటున్నారు. వర్కింగు కమిటీ తీర్మానములోనే ఆ సందు వుంచుకున్నారు గాన తమతో సంప్రదించి, డిఫెన్సు కోసమని చెబుతూ ఇండియా ప్రభుత్వము విదేశాలకు పంపితే సంతోషిస్తారా? ఈ ప్రశ్నలకు గాంధీయులు ఎవరూ జవాబివ్వరు, తెలివిగా మౌనం వహించుతారు. ఇట్టి వీరు సెంట్రల్ అసెంబ్లీ ఒక సెషన్‌ను బహిష్కరించాలని తీర్మానించినంత మాత్రాన ఎవరు ఉప్పొంగి పోతారు? పైగా పదేలు యిపుడు అశెంబ్లీ కమిటీ మీటింగులకు హాజరుకావచ్చునని ప్రకటించారు. గాంధీయుల దిగజారుడు పాలసీని, అత్తి వినాశకర విధానాన్ని కప్పిపుచ్చుకోడానికి వేసిన 'స్టంటు' అంటే తప్పా!

* * *

బోసుపై డిసిప్లినరీ చర్యను గురించి వ్రాస్తూ 12—8—39 తేదీ సంపాదకీయంలో ఆంధ్రపత్రిక, "శరత్ బోసుగారు వర్కింగు కమిటీని అభినందించిరట" అని అర్థం చేసికొంది, ఆచర్యయొక్క న్యాయాన్ని రుజువు చేయడానికి ఇది ఒక కారణంగా జూపింది.

శరత్‌బోసు, "వర్కింగు కమిటీ రాజకీయ పరిజ్ఞానానికి అభివందనాలు" అని హేళన చేసాడు. ఇంత చక్కగా అర్థంచేసికొని, అదొక కారణంగా చూపినందుకు ఆంధ్రపత్రిక విజ్ఞానాన్ని అభినందించవచ్చు.

* * *

ఈ మధ్య ఆంధ్రరాష్ట్రి కాంగ్రెస్ సంఘము వారి చిత్తు నిబంధనావళి ప్రకటిస్తూ "ఆంధ్రప్రభకు ప్రత్యేకము" అని ప్రకటించుకొంది "ఆంధ్రప్రభ".

ఇది అదివరకే కృష్ణా, ఆంధ్రపత్రికల్లో ప్రకటించబడింది. పోతే ఆంధ్రప్రభ ప్రత్యేకత ఏమిటి? 'మాకు ప్రత్యేకము' అని ప్రకటించుకోవడమే ఆంధ్రప్రభ ప్రత్యేకత,

ఒక సంఘము యొక్క నిబంధనావళి, అందులోనూ రాష్ట్రి కాంగ్రెస్ సంఘమువంటి సంఘము యొక్క నిబంధనావళి, నిజంగానే ఒక పత్రికకు ప్రత్యేకముగా పంపితే, ఆ రాష్ట్రి కాంగ్రెస్ కార్యదర్శిలో కూడ ఏదో 'ప్రత్యేకత' ఉన్నదన్నమాటే.

# జాతీయ సమరసన్నాహానికి సాగిరండు!

## అతివాద సమ్మేళన సంఘంవారి తీర్మానాలు.

కలకత్తాలో జరిగిన అతివాద సమ్మేళన సంఘ సమావేశంలో యీక్రింది తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి.

### జాతీయ సమరసన్నాహ వారం

"రాష్ట్రీయ స్వపరిపాలన ద్వారా ప్రజలకు చేకూరగల సౌకర్యాలు అతివేగంగా అడుగంటుచున్నవని త్రిపురీ కాంగ్రెసులో గుర్తించబడింది. దీనితోబాటు, యుద్ధప్రమాదాన్ని గురించి, ఫెడరేషన్ నిర్బంధాన్ని గురించి, త్రిపురీ కాంగ్రెసు జాగ్రత్తగా ఆలోచించి, దేశము యావత్తూ సామ్రాజ్యవాద ప్రభుత్వంతో పోరాటం జరపడానికి తయారు కావలసిందని హెచ్చరించింది.

"కాని, అప్పటినుండి నేటివరకు ఆతీర్మానానుసారం ప్రజలను స్వరాజ్య పోరాటానికి తయారుచేసేటందుకు ఎట్టి ప్రయత్నము జరిగియుండలేదు. పైగా, బాధ్యతాయుతులైన నాయకులు దేశం నేడు పోరాటానికి తయారుగా లేదని ఎడతెగని ప్రచారం చేస్తున్నారు. ఇందువల్ల ప్రజల ఉత్సాహం చాలావరకు చల్లబడడమే కాకుండా, ప్రజల స్వాతంత్ర్యాన్ని, ఆశయాలనూ, సామ్రాజ్యవాదులు అరికట్టడం, ఫెడరేషన్ పెనుభూతాన్ని ప్రజలపై బలాత్కారంగా రుద్దడానికి ప్రయత్నాలు విరివిగా సాగించటం, జరుగుతోంది.

"అయినప్పటికీ, ప్రజలు ఎంత యెక్కువ దారిద్రావస్థలో ఉన్నా, సామ్రాజ్యవాదులపైన, ధనికవర్గాలపైన, వారుతిరుగబడుతూనే ఉన్నారు. కార్మిక, కర్షక సంస్థలు దేశమంతటా విరివిగా స్థాపించబడి, వాటిద్వారా ప్రజాసామాన్యం తమ ఉద్యమాన్ని ఎక్కువ శక్తివంతం చేసుకొంటూంది. మన చరిత్రలో ప్రథమ పర్యాయం లక్షలాది సంస్థాన ప్రజలు రాజకీయ రంగంలో ప్రవేశించి, ప్రజాస్వామిక హక్కులకొరకు, పౌర స్వాతంత్ర్యానికి, వ్యవసాయ సంస్కరణలకు బ్రహ్మాండమైన పోరాటాలు ప్రారంభించారు. ప్రజాసామాన్యం లక్షలకొద్దీ కాంగ్రెసులో సభ్యులుగాచేరి, ఒక ఐక్యనాయకత్వం కొరకు ఎదురు చూస్తున్నారు.

"కాబట్టి ప్రజాసామాన్యం నేడు తమ ఉన్నతాదర్శాల కనుగుణ్యమైన భారతదేశాన్ని నిర్మించగలశక్తిని కలిగియున్నదనడంలో ఎట్టి సందేహము లేదు. వారి స్వయం శక్తిని వారికి అవగాహన చేసి, యింతవరకూ వారు జరుపుతూ వచ్చిన దైనందిన పోరాటాలను కేంద్రీకరించి బ్రహ్మాండమైన జాతీయ పోరాటముగా మార్చవలసిన బాధ్యతమాత్రం ఎంతో ఉంది.

"కాని, దురదృష్టవశాత్తు మన జాతీయ సంస్థ (కాంగ్రెసు) యందలి సంస్కరణవాదులు సంస్థలో అంతఃకలహం ఒకటి తెచ్చిపెట్టారు. డిసిప్లిన్ పేరట, జాతీయఐక్యతయొక్క పునాదులకే సర్వనాశనం కలుగుతోంది.

"ఈ విధ్వంసాన్ని, కాంగ్రెసులో అధికార వాంఛవల్ల యేర్పడిన కుళ్లనూ, అరికట్టి దేశీయుల పోరాటశక్తిని గురించి వారికి తెలియ చెప్పుటకూ; దేశమంతటినీ స్వరాజ్యపోరాటానికి తయారు చేయడానికి-ప్రజల దృష్టిని ప్రధాన సమస్య అయిన సామ్రాజ్య వ్యతిరేక పోరాటంమీద కేంద్రీకరింపజేయవలసి యుంటుంది. అట్టి పోరాటానికి తయారు కావలసినదని హెచ్చరిస్తూ చేయబడిన కాంగ్రెసు తీర్మానాలపైన, పోరాట సన్నాహాలమీద ప్రజల దృష్టి యావత్తు కేంద్రీకరించబడాలి.

### కార్యక్రమం

కనుక, 1939 వ సంవత్సరం ఆగస్టు 31 మొదలు సెప్టెంబరు 6 వరకు "జాతీయ సమర సన్నాహవారము"ను జరుపవలసినదిగా అతివాద సమ్మేళన సంఘమువారు తమ అధీన సంఘములను, దేశీయు లందరినీ, హెచ్చరించుచున్నారు. ఈ వారంరోజులు కాంగ్రెసు తీర్మానాలను ప్రచారం చేయడానికి, కాంగ్రెసు ఐక్యతను బలపరచడానికి, యావద్భారత స్వరాజ్యపోరాటానికి సన్నాహాలు జరుపుటకూ, ఉద్దేశించబడ్డాయి కాబట్టి కాంగ్రెసు వాదులందరు వారు యే పార్టీలకుచెందిన వారైనప్పటికీ, తమ సహకారము ఈయవలసిందని యీ కమిటీవారు కోరుచున్నారు. ఈ సందర్భంలో, ఒక విషయాన్నిగురించి మేము జ్ఞాపకం చేయవలసియుంది. ప్రచారకులు తమ ఉపన్యాసాలలో నిగ్రహమును, మర్యాదను, చూపవలసినదిగా కోరుచున్నాము. పోరాటానికి సంబంధించిన అసలు సమస్యకే ప్రాముఖ్యత నీయవలసిందని హెచ్చరిస్తున్నాము.

"మనకున్న వ్యవధి చాలా తక్కువ. "జాతీయ సమరసన్నాహవారము"లో ప్రదర్శనాలు, ఊరేగింపులు, బహిరంగసభలు, జయప్రదంగా జరపడానికి వెంటనే ప్రతివారు కరపత్రాలద్వారాను, పోస్టర్లద్వారాను, వీధిసభలద్వారాను, యింటింటికివెళ్లి చేయు ప్రచారం ద్వారాను, ఇతర పద్ధతులవల్లను, సన్నాహాలు ప్రారంభించవలసినదిగా కోరుచున్నాము. ఈవారములో కాంగ్రెసు సభ్యుల్నికూడా విరివిగా చేర్పవచ్చును. అయారోజుల కార్యక్రమము యీక్రిందయిస్తున్నాము.

| | |
|---|---|
| ఆగస్టు 31: | రాజకీయఖైదీల విడుదలకొరకు, పౌరసత్వపు హక్కులకొరకు ఆందోళన |
| సెప్టెంబరు 1: | రైతులయొక్క, కార్మికుల యొక్క, కోర్కెలు |
| సెప్టెంబరు 2: | యుద్ధవ్యతిరేక ప్రచారం |
| సెప్టెంబరు 3: | ఫెడరేషన్ ప్రతికూల ప్రచారం |
| సెప్టెంబరు 4: | విదేశీవస్త్ర బహిష్కరణ, బ్రిటిష్ వస్తు బహిష్కరణ |
| సెప్టెంబరు 5: | సంస్థాన ప్రజల కోర్కెలకై ప్రచారం |
| సెప్టెంబరు 6: | జాతీయ వాంఛా తీర్మానము, జాతీయ ఐక్యత." |

### యుద్ధవ్యతిరేక తీర్మానం

రాబోయే సామ్రాజ్యవాద యుద్ధాన్నిగురించి అతివాద సమ్మేళన సంఘంవారు యీ క్రింది తీర్మానాన్ని ఆమోదించారు:

"యుద్ధాన్నివ్యతిరేకిస్తూ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు చేసిన తీర్మానం మాకు అంగీకారమే అయినప్పటికీ, ప్రస్తుత అంతర్జాతీయ విషమ పరిస్థితులనుబట్టిన్నీ, సామ్రాజ్యవాద యుద్ధంలో భారతదేశ సంపదను వినియోగించుకొనే ప్రయత్నాలు విరివిగా సాగుతున్నందునను, వర్కింగ్ కమిటీవారు యీవిషయంలో తీసుకొన్న చర్య ఏమాత్రమూ సరిపోదని యీ కమిటీవారి దృఢాభిప్రాయం. రాబోయే కేంద్ర శాసనసభను కాంగ్రెస్‌పార్టీ సభ్యులు బహిష్కరించి ఊరుకోవడంవల్ల ప్రయోజనంలేదని యీ కమిటీవారభిప్రాయ పడుచున్నారు. కాంగ్రెసు సభ్యులు తమ స్థానాలకు రాజీనామాలిచ్చి, యీ సమస్యపై తిరిగి యెన్నికలకు నిలబడడం తగినపని.

"అంతేగాక, కాంగ్రెసుమంత్రివర్గాలు 'రక్షణ కార్యక్రమా'లని పిలువబడే చర్యలకు ఎట్టి సహకారం చేయకూడదనీ, ఆ విధంగా సహకారంచేస్తే, తగినంత యుద్ధవాతావరణం కల్పించబడుతుందనీ, సామ్రాజ్యవాదుల యుద్ధసన్నాహాలుకూడా నిరాఘాటంగా సాగిపోవడానికి అవకాశం కలుగుతుందనీ, యీ కమిటీవారు అభిప్రాయపడుతున్నారు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని నిరోధించాలంటే, దేశమంతటా తీవ్రమైన యుద్ధప్రతికూలోద్యమం వ్యాపింపజేయవలసియుంటుంది కాబట్టి కాంగ్రెసువాదులు సామ్రాజ్యవాదయుద్ధంలో భారతీయులఅర్థబలం, అంగబలం వినియోగించుకొనబడకుండా ప్రతిఘటిస్తూ తీవ్రమైన ఉద్యమం ప్రారంభించి, హరిపురా కాంగ్రెసు తీర్మానాన్ని ఆవిధంగా ఆచరణలో పెట్టవలసిందని యీ కమిటీవారు హెచ్చరించుచున్నారు. యుద్ధ సన్నాహాలకు తమ వ్యతిరేకతను ప్రకటిస్తూ రాష్ట్ర శాసనసభలలో కాంగ్రెసు పార్టీసభ్యులు తీర్మానాలు ప్రతిపాదించవలసి యుంటుంది. కాంగ్రెసులో ప్యాసైన యుద్ధ వ్యతిరేక తీర్మానాన్ని ప్రజలలో ప్రచారం చేయుడానికి కాంగ్రెసు కమిటీలు యితర సామ్రాజ్య వ్యతిరేక సంస్థలతో కలసి బహిరంగసభలు, ఊరేగింపులు జరుపవలసిందని కోరుచున్నాము. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చేయబోయే యుద్ధంలో భారతదేశం యిరికింపబడకుండా ప్రతిఘటించడానికి ఏ యే సన్నాహాలు అవసరమో అవి చేయవలసినదిగా యీ కమిటీవారు కోరుచున్నారు."

### అతివాదులపై దాడి

అతివాద సమ్మేళన సంఘంవారు జూలై 9 వ తేదీన జరిగిన సభల విషయంలో వర్కింగ్ కమిటీచేసిన నిర్ణయాలను గురించి యీక్రింది తీర్మానం చేశారు :

"దేశంలో రాష్ట్రీయ స్వపరిపాలన అమలులోకి వచ్చినప్పటి నుంచీ కాంగ్రెసులోఉన్న అతివాదుల్ని అణచివేయడానికి స్పష్టమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. హరిపుర కాంగ్రెసులో జవహర్లాల్ నెహ్రూ యిచ్చిన రిపోర్టులో యీదాడిని గురించి తెలియజేశారు. ఇప్పటికినీ అదాడి నిరాఘాటంగా సాగుతూ వస్తోంది. చట్టసమ్మత పద్ధతుల్ని వ్యతిరేకిస్తూ, సంపూర్ణస్వరాజ్యం కొరకు పోరాటాన్ని సాగించాలని ప్రచారంచేసే కాంగ్రెసు అతివాద శక్తుల ప్రాధాన్యతను గమనించకుండా వారిని దూరంచేసి అణచివేయాలని మితవాదుల అభిప్రాయం. అతివాదుల నాయకత్వం క్రింద బయల్దేరిన ప్రజా ఉద్యమాలు కాంగ్రెసు నాయకులకు యిబ్బంది కలుగజేస్తున్నాయి. ఎందువల్లనంటే వారు చట్టసమ్మత పద్ధతులకే అంటిపెట్టుకొని, పోరాటమార్గాన్ని విడిచిపెట్టదలచుకున్నారు. కనుకనే కాంగ్రెసులో వారికిగల మెజారిటీని అవకాశంగా తీసుకొని యిటీవల సమావేశమైన అఖిలభారత కాంగ్రెసు కమిటీలో ప్రజాఉద్యమాలను అరికట్టే తీర్మానాలు రెండు ప్యాస్‌చేశారు. ఈరెండు తీర్మానాలు తమనూ జాతీయ పోరాటాన్ని అణచివేయడానికే చేయబడినట్లు అతివాదులు గ్రహించి, వీటివెనుక దాగియున్న ప్రమాదాన్ని ప్రజలందరికీ తెలియ జెప్పడానికి నిశ్చయించుకున్నారు. అందుకు ఒకేరోజున దేశమంతటా బహిరంగసభలు యేర్పాటుచేశారు. ఈసభలు జరపడంలో ఏ కాంగ్రెసు నిర్ణయాన్నిగాని ఏ నిబంధననుగాని, ఉల్లంఘించాలని వారి ఉద్దేశంకాదు. కాంగ్రెసువాదులకూ, కాంగ్రెసు సంస్థవెనుక నిలబడే ప్రజలందరికీ, పైరెండు తీర్మానాలలో—ముఖ్యంగా సత్యాగ్రహాన్ని నిషేధిస్తూ చేయబడిన తీర్మానంలో — ఎంత హానివున్నదో చూపడానికి ఆసభలు జరపబడ్డాయి. అతివాదులు ఆవిధంగా చేయడం అసాధారణ పద్ధతిఅని ఎవరైనా అంటే, పైరెండు తీర్మానాలే అట్టి అసాధారణ పరిస్థితులను ప్రోత్సహించాయని జవాబు చెప్పవలసి వస్తుంది.

### ఇది అతి ప్రమాదకరమైన తీర్మానం

"జూలై 9 వ తేదీని జరిగిన సభలలో పాల్గొన్న కాంగ్రెసువాదులెవరూ డిసిప్లిన్‌ని ఉల్లంఘించారని చెప్పడానికి వీల్లేదు. అవిధేయత ఎంతమాత్రమూ వారి మనస్సులలోలేదు. కాంగ్రెసు తీర్మానాలను ఆచరణలో పెట్టడంలో సాధారణ కాంగ్రెసు వాదులకూ, కాంగ్రెసు కమిటీ కార్యనిర్వాహకులకూ మధ్య భేదం కలదని వాదించబడుతోంది. కార్యనిర్వాహకులు సహితం తీర్మానాలపై తమ అభిప్రాయాలు చెప్పే హక్కు ఉంది. ఇదివరలో ఆ ఆచారం ఉంది. ఏదైనా ఒక కాంగ్రెసు నిర్ణయంపై అభిప్రాయాలు ప్రకటిస్తూ, ఆ నిర్ణయాన్ని మార్చవలసిందనిగాని, ఉపసంహరించుకోవలసిందనిగాని, కోరితే, అది డిసిప్లిన్‌ని ఉల్లంఘించడమే అవుతుందని యింతవరకు పరిగణించబడలేదు. జూలై 9 వ తేదీ సభలలో పాల్గొన్న కాంగ్రెస్‌కమిటీ కార్యనిర్వాహకులుఇంతకంటెఎక్కువ చేసిందిలేదు. అయినా, వారు డిసిప్లిన్‌ని ఉల్లంఘించారని వర్కింగ్ కమిటీ తీర్మానించింది. సుభాస్‌బోసు మీద చర్యకూడా తీసుకొనబడింది. ఇది చాలా అన్యాయం.

"వర్కింగ్ కమిటీవారు తీసుకున్న యీ చర్య అతి ప్రమాదకరమైనదని మా అభిప్రాయం. అతివాదుల్ని అణచివేయడానికే ఆ తీర్మానం చేయబడింది. డిసిప్లిన్‌ని కాపాడటానికికాదు. డిసిప్లిన్‌ని కాపాడటానికి అతివాదులెప్పుడూ వర్కింగ్ కమిటీతో హృదయపూర్వకంగా సహకారం చేస్తారు. ఎందుకంటే డిసిప్లిన్‌యొక్క విలువ అవశ్యకత వారికి చక్కగా తెలుసు. కాని, యీ సందర్భంలో డిసిప్లిన్ ఒక ముఠావారి అవసరానికి ప్రయోగించబడుతోంది. సంస్కరణ విధానాన్ని అంటిపెట్టు



కొని ఘూర్ఫేచటం ఆ ముఠాయొక్క ఆశయం. ఇదివరలో కాంగ్రెసు డిసిప్లిన్‌ని ఉల్లంఘించిన వారిమీద ఎట్టి చర్య తీసుకొనబడలేదని ఎల్లరికీ తెలిసిన విషయమే. యుద్ధాన్ని గురించి, ఫెడరేషన్‌ని గురించి, జాతీయవాంఛనుగురించి, కాంగ్రెసులో ప్యాసైనతీర్మానాలను బాహాటంగా వ్యతిరేకిస్తూవచ్చినకాంగ్రెసు హేమాహేమీలమీదక్రమశిక్షణ చర్య తీసుకొంటే, అధికారంలో ఉన్న మితవాద ముఠావారికి యిబ్బంది కలుగుతుంది కాబట్టి వారావిధంగా తీసుకోలేదు. ఇట్టి పరిస్థితులలో అతివాద సమ్మేళన సంఘసభ్యులు కాంగ్రెసువాదులే అయినప్పటికీ, కాంగ్రెసు తీర్మానాలకు కట్టుబడి యున్నప్పటికీ, సుభాస్ చంద్ర బోసుగారిపై తీసుకొనబడిన శిక్షణచర్యకు తమ తీవ్రమైనఅసమ్మతిని ప్రకటించకుండాఉండలేరు. నిజం చెప్పవలసివస్తే యీ చర్యవల్ల దేశంయొక్క అన్నిమూలలా తీవ్రమైన అసమ్మతి వ్యాపించకమానదు.

### కాంగ్రెసు వాదుల కర్తవ్యం

"ఏపార్టీకి చెందినవారైనప్పటికీ, కాంగ్రెసువాదులు, ప్రజలు, యీవిషయంలో శ్రద్ధవహించి కాంగ్రెస్ సంస్థను, కాంగ్రెసు గౌరవానికి, కాంగ్రెసు ఐక్యతకు, తీరనిహాని కలుగజేసిన యీ వర్కింగ్‌కమిటీ తీర్మానంపై తమ అభిప్రాయాన్ని ప్రకటించవలసినదిగా మేము కోరుచున్నాము. కాంగ్రెసుయొక్క భవిష్యత్తును గురించి ప్రతి కాంగ్రెసువాది తీవ్రంగా ఆలోచించి, వినాశకరమైన పద్ధతులు అరికట్టబడడానికి తమ శక్తినంతటినీ వినియోగిస్తారని ఆశిస్తున్నాము

"ఈసందర్భంలోనే, వర్కింగ్ కమిటీవారు బెంగాల్ రాజకీయ ఖైదీల విడుదలకై ఎట్టి ప్రజాఉద్యమం ప్రారంభించ దలచుకోకపోవడమే గాక, "సక్రమ పరిపాలన"కై తహతహలాడడం ఏమీ బాగులేదని యీ కమిటీవారు అభిప్రాయ పడుతున్నారు. కాంగ్రెసు రాష్ట్రాలలో, రైతు, కార్మిక ఉద్యమాలను పోలీసుల సహాయంతో అణచివేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రజాఉద్యమాలను పూర్తిగా విడనాడి, చట్టసమ్మత పద్ధతులపైననే ఆధారపడియుంచే సాధారణ "పాలిసీ"లో యిది ఒక భాగం మాత్రమే. ఈవిధానం స్వరాజ్య పోరాటాన్ని బలహీనపరుస్తుంది, జాతీయైక్యతను భగ్నపరుస్తుంది.

"కాబట్టి, వర్కింగ్ కమిటీ తీసుకొన్న శిక్షణచర్యను ఉపసంహరించుకొనేటట్లు, అతివాదులపై దాడిని మానుకొనేటట్లు చేయడానికి తక్షణమే కాంగ్రెసు వాదులందరూ ఆందోళన చేసి, ప్రజాభిప్రాయాన్ని ప్రకటించడం ద్వారా, తాము చేసిన నిర్ణయాన్ని తిరిగి ఆలోచించి, రద్దుచేసుకోవలసినదిగా వర్కింగ్ కమిటీని అతివాద సమ్మేళన సంఘానికి చెందియున్న పార్టీలు, వ్యక్తులు హృదయపూర్వకముగా ప్రార్థిస్తున్నారు."

### రాజకీయ ఖైదీల విడుదల

రాజకీయ ఖైదీల విడుదల సమస్యను గురించి అఖిలభారత అతివాద సమ్మేళన సంఘంవారు యీక్రింది తీర్మానాన్ని ఆమోదించారు.

"బెంగాల్ రాజకీయ ఖైదీలు 2 నెలలలోగా విముక్తం చేయబడకపోతే, సత్యాగ్రహం ప్రారంభించ వలసినదని బెంగాల్ రాష్ట్రకాంగ్రెసు కమిటీ చేసిన తీర్మానాన్ని యీ కమిటీవారు హృదయ పూర్వకంగా ఆమోదిస్తున్నారు. అట్టి సత్యాగ్రహానికి పూర్తిగా సహాయం చేయడానికి కాంగ్రెసు వాదులు బహిరంగ సభలు, ఊరేగింపులు, జరపడం; రాజకీయ ఖైదీల విడుదలను కోరుతూ తీర్మానాలు చేయడం; సత్యాగ్రహంలో పాల్గొనడానికి వాలంటీర్లుగా చేరడం; ధనం వసూలు చేయడం-వగయిరా కార్యక్రమంలో పాల్గొనవలసిందని హెచ్చరించుచున్నాము. అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు రాజకీయ ఖైదీల విడుదలకై తమ అధీన కాంగ్రెసు కమిటీలన్నింటికి తీవ్రమైన ఆందోళన జరుపవలసినదని, ఉత్తరువులు పంపవలసిందనీ, సత్యాగ్రహ పోరాటానికి సర్వవిధముల సహాయం చేయవలసినదనీ, యీ కమిటీవారు కోరుచున్నారు."

---

### కొత్తపేట కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ సమావేశము.

ది 12-8-39 న శనివారం పగలు 12 గంటలకు కొత్తపేటలో కామ్రేడ్ మంతెన నరసింహ రాజుగారి అధ్యక్షతను సమావేశమై ఈ దిగువ తీర్మానములు చేయడమైనది.

1. కామ్రేడ్ శెట్టిపల్లి అకాల మరణమునకు ఈ కమిటీ చింతిల్లుచు, వారి కుటుంబమునకు సానుభూతి తెలియజేయుచున్నది.

2. రాబోవు ప్రపంచ సంగ్రామంలో భారతీయులు ధనసహాయముగాని, జన సహాయముగాని చేయరాదనియు, తాలూకాలో యుద్ధ వ్యతిరేక ప్రచారము గావించుటకు గాను తీర్మానించడమైనది.

3. బ్రిటిష్ ప్రభుత్వంయొక్క దురాగ్రహమునకు గురియై శిక్షింపబడి జైళ్లలో మ్రగ్గుచున్న రాజకీయ ఖైదీల విముక్తికై గాంధీ మహాత్ముని ప్రయత్నములుకూడ విఫలమైన మీదట యిక గత్యంతరము లేక సుమారు 25 రోజులు నిరాహార దీక్ష బూనిన దండం, అలీపూర్ జైళ్లలోని రాజకీయ ఖైదీల నీ కమిటీ అభినందించుచున్నది. దేశీయ నాయకుల సలహాపై నిరాహార దీక్షను ప్రస్తుతము నిలుపు చేసిన ఆ రాజకీయ ఖైదీల అభీష్టము నెరవేరుటకు, దేశంలో నున్న రాజకీయ ఖైదీలనందరినీ ఎట్టిషరతులులేక విడుదల అయే పర్యంతం నిరంతర ఆందోళన చేయవలసినదిగ దేశీయ నాయకులను, ప్రజలను ఈ కమిటీ హెచ్చరించుచున్నది

4. మునగాల రైతుల సత్యాగ్రహంలో సుమారు 90 మంది అరెస్టు కాబడి యున్నారు. తదుపరి రివెన్యూ మంత్రి గౌ॥ టంగుటూరి ప్రకాశంగారి సలహాపై సత్యాగ్రహం నిలిపివేయబడ్డది. శ్రీ ప్రకాశంగారి వాగ్దానం ననుసరించి మునగాల సత్యాగ్రహ సందర్భమున అరెస్టు కాబడిన 90 మంది విడుదల కాబడలేదు. గాన వారిని వెంటనే విడుదలచేయవలసినదిగా కాంగ్రెసు మంత్రులను కోరడమైనది.

5. కాశీపట్టణం జమీందారు, రైతుల భూములను అక్రమముగా అమ్మివేయుటయు, రెవిన్యూ మంత్రి గౌ॥ టంగుటూరి ప్రకాశంగారి సలహాపై సత్యాగ్రహము నిలిపివేయుటయు యిదివరలో జరిగియున్నది. కాని శ్రీ ప్రకాశంగారి వాగ్దానం ప్రకారం యింతవరకు కాశీపట్టణం సమస్య పరిష్కరింపబడలేదు. క్రొత్తగా భూములను కొనుక్కొన్న రైతులు భూములను సాగుచేసుకొనుచున్నారు. కాశీపట్టణం రైతులలో తిరిగి అసంతృప్తి ప్రబలి సత్యాగ్రహం ప్రారంభించే పరిస్థితులు ఏర్పడుచున్నవి. గాన ప్రభుత్వము వెంటనే కాశీపట్టణం సమస్యను పరిష్కరించి ఆ రైతుల అసంతృప్తిని పోగొట్టవలసినదిగా ఈ కమిటి కోరుచున్నది.

6. తాలూకాలో రాజకీయ ప్రచారం గావించుటకు వాలంటీరు యాత్ర జరుపుటకు తీర్మానించడమైనది. యాత్రకు తగు సహాయము చేయవలసినదిగ జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీని కోరడమైనది.

* * *

### భీమవరం తాలూకా కాం. సోషలిస్టుపార్టీ.

ది 14-8-39 తేదీ సాయంకాలము 10 గంటలకు కామ్రేడ్ కృత్తివెంటి వెంకటేశ్వర రావుగారి అధ్యక్షతను సమావేశమై గావించిన తీర్మానములు.

1. రాష్ట్రతీర్మానం ప్రకారం ప్రతిసభ్యుడూ ప్రతినెలా అణా చెల్లించుట, నవశక్తి చదువుట, ప్రతి పార్టీమీటింగుకు హాజరగుట చేయవలయునని పార్టీ సభ్యులను హెచ్చరించడమయినది.

2. నేటివరకు పార్టీ కార్యదర్శిగావున్న కామ్రేడ్ సంకు అప్పారావుగారుచేసిన సేవను కొనియాడుచూ, వారి రాజీనామా సక్రమముగా వున్నందున రాజీనామా అంగీకరించడమయినది.

3. పార్టి కార్యదర్శిగా కామ్రేడ్ దర్పా శ్రీరామమూర్తిగారిని ఏకగ్రీవముగా ఎన్నుకోవడమయినది.

4. పార్టి ఆర్గనైజరుగా కామ్రేడ్ సంకు అప్పారావుగారిని ఎన్నుకోవడమయినది.

5. ప్రతిసభ్యుడు ఆగస్టు నెలనుంచి రాష్ట్రపార్టికి 0-1-0 గాక తాలూకాపార్టీకి 0-0-6 తప్పనిసరిగా యివ్వవలసినదిగా తీర్మానించడమయినది.

6. పార్టి సభ్యులకు ఆయా సంఘములో పనిచేయుటకు నిర్ణయించి వారివద్ద రిపోర్టులు తెప్పించుటకు కార్యదర్శికి అధికారము యివ్వడమయినది.

7. పార్టి కార్యదర్శి, ఆర్గనైజరు, కృ. వెంకటేశ్వరరావు, యాళ్లబండి పోలిశెట్టి, పెన్మెత్స వెంకట సోమరాజుగార్లను కమిటీగా వుండుటకు తీర్మానించడమైనది.

8. దేశసేవయే పరమావధిగా ఎంచుకొని నిత్యము కాంగ్రెసు సేవచేయుచున్న కామ్రేడ్ శెట్టిపల్లి వెంకటరత్నంగారి అకాల మరణమునకు ఈ సభవారు చింతిల్లుచూ వారి కుటుంబమునకు సానుభూతిని తెల్పుచున్నారు.

9. కాశీపట్టణం జమీందారుకు, రైతులకు జరిగిన పోరాటంలో ప్రభుత్వమువారు కలుగజేసుకొని, జిల్లా కలెక్టరుగారిద్వారా బహిరంగ విచారణచేసి, యిప్పటికి చాలా కాలమైనను, యింతవరకు ప్రభుత్వంవారు తీర్పు చెప్పియుండలేదు. అందువల్ల రైతులకు వ్యవసాయ శరుణమగుటచే రైతులగు యిబ్బంది కలుగుచున్నదని, అభిప్రాయపడుచు, వెంటనే ప్రభుత్వము తీర్పును ప్రకటించవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుచున్నాము.

10. మునగాల రైతుపోరాటంలో కలుగజేసుకొని, పోరాటం ఆపుచేయించిన శ్రీ రివెన్యూ మంత్రిగారగు ప్రకాశం పంతులుగారిని ఈ సభవారు అభినందించుచు, అప్పటి రైతులకు లోగడ జరిగిన వొడంబడిక అయినను, కనీసం అమలుజరుపవలసినదిగా ఉత్తరువులు యివ్వవలసినదిగా ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

11. అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీవారు శ్రీయుత సుభాస్‌చంద్రబోసుగారిపై తీసుకున్న చర్యకు విచారించుచూ, ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసులో ఎక్కువ చీలికలు కలుగుటకు అవకాశముకలదని అభిప్రాయ పడుచూ వెంటనే డిసిప్లినరీ చర్య రద్దుపరచవలసినదిగా అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీవారిని ఈ సభవారు కోరుచున్నారు.



* * *

### నిరసన సభలు

సుభాష్ చంద్రబోసుగారిపై వర్కింగ్ కమిటీ తీసుకొన్న డిసిప్లినరీ చర్యను నిరసిస్తూ బెజవాడ, ఏలూరు, గుంటూరు, రాజమండ్రి, చిత్తూరు, చీరాల భీమవరం, పేల్పూరు, గూడూరు, తణుకు, కోలవెన్ను, కొల్లూరు, మొదలైన చోట్ల బహిరంగసభలు జరిగాయి.

గుంటూరు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులైన ముసునూరు భార్గవరావుగారు వర్కింగ్ కమిటీ చర్యపై తమ అసంతృప్తిని ప్రకటిస్తూ జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు.

* * *

### గోభూమి అన్యాక్రాంతం చేయుట.

మీర్జాపురం ఎస్టేటులోని కొత్తగూడెం గ్రామంలో అనాదినుండి రైతుల సమిష్టిహక్కుభుక్తములలోవున్న గోభూమిని, జమీందారుగారి ఏజెంటు ఆ గ్రామకరణం అయిన మెట్లపల్లి చంద్రశేఖరరావుగారు ఇతర గ్రామస్థులకు నజరానా పుచ్చుకొని దఖలుపర్చ ప్రయత్నించుతున్నారు. భూమ్యాక్రమణకు వచ్చినవారిని కొత్తగూడెం రైతులు అడ్డగించారు. అనాదిసిద్ధంగా రైతుల పశువులను మందవేయడానికి వినియోగపడుతున్న ఆ గోభూమిని జమీందారుగారు అన్యాక్రాంతం చేయ ప్రయత్నించుట అక్రమము. ప్రకాశం కమిటీరిపోర్టుకూడా సూచనలనుండి తప్పించుకొనుటకు, భూమిని ఇతరుల స్వాధీనం చేసి లాభం పొందుటకు చేయు ప్రయత్నాలను మద్రాసు ప్రభుత్వంవారు స్థానిక అధికారులకు ఉత్తరువులంపి అడ్డగించి, సహాయులగు రైతులకు తోడ్పడాలి.

# రైతులోకం

కృష్ణాజిల్లా రైతు స్వచ్ఛంద సేవక ట్రెయినర్ల శిక్షణ శిబిరము—కవుతరం. సెప్టెంబరు 1 వ తేదీనుండి ప్రారంభము.

ఈ సంవత్సరం కృష్ణాజిల్లాలో జరుగనున్న అఖిలభారత కిసాను మహాసభ జయప్రదముగా జరిపించుటకు శిక్షణపొందిన స్వచ్ఛంద సేవకుల తోడ్పాటు కావలసియున్నది. అదియునుగాక రైతు సంఘముల నిర్మాణ కార్యక్రమము కొనసాగించుట యందును, రైతుల దైనదినం కష్టముల నివారించుకొనుటకును, పౌరసత్వ హక్కుల కాపాడుకొనుటలో సంభవించెడి పోరాటములను సక్రమముగా నెదుర్కొని ప్రజాసామాన్యాన్ని నడుపుటకును క్రమశిక్షణ పొందిన రైతు స్వచ్ఛందసేవకు లుండుట అవసరమని గుర్తించి, బెజవాడలో ది 10-8-39 న కృష్ణాజిల్లా రైతు సాధారణసంఘ సభ్యులు సమావేశమై జిల్లారైతుసంఘ యాజమాన్యమున కవుతరం గ్రామములో కృష్ణాజిల్లా రైతు స్వచ్ఛందసేవక ట్రెయినర్ల శిక్షణ శిబిరమును సెప్టెంబరు 1 వ తేదీనుండి ఒకనెల దినములు నడుప తీర్మానించినారు. వివిధ సెంటరులలో గల వాలంటీయర్లకు తరిఫీదొసంగుటకుగాను ప్రస్తుతము నలుబదిమందిని ట్రెయినర్లుగా తయారుచేయుటకు తీసుకొనబడుదురు. లాఠీ. డ్రిల్లు, మార్చింగు ప్రథమచికిత్స మొదలగునవి కట్టుబాటులతో నేర్పబడును. ఈ శిక్షణ శిబిరములో శిక్షణపొందుటకు ప్రవేశింపదలచిన వారు వాలంటీయర్లకు శిక్షణ యొసంగుటకు తమ కాలమును పూర్తిగా వినియోగించుటకు అవకాశము గలవారుగా నుండవలెను. ఎత్తు, బరువు, ఛాతీ కొలతలను వుదహరించుచు 5-0-0 ల రుసుమును తమ అప్లికేషనుతో పంపగోరుచున్నాను. భోజన వసతులు వుచితము. శరీరారోగ్యము కలవారిచే దరఖాస్తులను పంపగోరుచున్నాను. అప్లికేషనులను రుసుములతో "పామిరెడ్డి వెంకట సుబ్బారావు రెడ్డి, కృష్ణాజిల్లా రైతుసంఘ ప్రధాన కార్యదర్శి చోకిషర్ల పోస్టు కృష్ణాజిల్లా" అని పంపవలెను. అగష్టునెల 25 వ తేదీలోగా అప్లికేషనులు చేరవలెను.

★ ★ ★

మధిర రైతుసంఘ స్థాపన.

నైజాం సంస్థాన మండలి మధిరలో ది 5-8-39 రోజున రైతు సంఘము స్థాపించబడినది. సుమారు యేబదిమంది రైతు ప్రముఖులు విచ్చేసిరి. ఐకమత్యము, పరస్పర సహకారము మొదలైన విషయములు చెర్కుమిల్లి హనుమయ్యగారిచేతను, అమ్మనమంచి కామయ్యగారిచేతను బోధింపబడెను. అనంతరము యీ క్రింది కమిటీ ఏర్పరుపబడెను.

అధ్యక్షులు: చెర్కుమిల్లి హనుమయ్యగారు
కార్యదర్శి: అమ్మనమంచి కామయ్యగారు
కోశాధిపతి: కట్టా వెంకట్రాయుడుగారు
8 గురు కార్యనిర్వాహకులు కూడా ఎన్నుకొనబడిరి.

★ ★ ★

కృష్ణాజిల్లా రైతుసంఘం, బెజవాడ.

ది 30-8-39 మధ్యాహ్నం 2 గంటలకు గుడివాడ తాలూకా, కనుమూరు గ్రామములో గ్రంథాలయంవద్ద జిల్లా రైతుసంఘ నిబంధనావళిలో యీ క్రింది మార్పులు చేయుటకు కృష్ణాజిల్లారైతుసంఘ ప్రత్యేకసమావేశము జరుగును గాన సభ్యులందరు తప్పక విచ్చేయ ప్రార్థితులు.

కృష్ణాజిల్లా రైతుసంఘం మొదట ప్రత్యేక సంఘంగా ఏర్పడినప్పటి సమయములో చేసిన ఎన్నిక నిబంధనలు ఆంధ్రరాష్ట్ర రైతుసంఘముతో అనుబంధ పరచడంద్వారా అనుబంధ సంఘముగా మారుటవల్ల ఇకముందు అఖిల భారత రైతుసంఘంవారు చేయు ఎన్నిక ఏర్పాట్లతో వైరుధ్యం లేకుండునట్లు ఈ జిల్లా సంఘపు ఎన్నికలకు ప్రాథమిక సభ్యులను చేర్చుటకు సంబంధించిన నిబంధనలను మార్చుటను గురించి.

ఇట్లు,
కామినేని వెంకటప్పయ్య.
అధ్యక్షుడు.

షరా:—'కనుమూరు' గ్రామం బందరు, బెజవాడ రోడ్డుమీద నున్నది. (2) సాధారణ సమావేశములో తీర్మానములు ప్రతిపాదించ తలచినవారు ఆర్టికలు 29 ననుసరించి సమావేశమునకు 3 రోజులు ముందుగా (27-8-39 వ తేదీకి) అందునట్లుగా తీర్మానములు పంపించవలెను.

★ ★ ★

అడవులరోదన అరణ్యరోదనమేనా?

వెల్లంకి విశ్వేశ్వరరావుగారిట్లు వ్రాయుచున్నారు:

జమీందారీ విచారణ కమిటీవారి రిపోర్టు ప్రకటింపబడి ఎసెంబ్లీలో ఆమోదింపబడినప్పటి నుంచీ జమీందార్ల అక్రమాలు పూర్వంకంటె ఎక్కువ కాజొచ్చాయి. ముఖ్యంగా కృష్ణాజిల్లాలోని జమీందార్లు శాసనానికి విరుద్ధంగా అడవులు కొట్టించి, తమ నౌకర్లకు బంధువులకు ఆశ్రితకోటిలోనివారికి వ్రాసియిచ్చుట ప్రారంభించారు. రైతులు ఈదారుణాన్ని గురించి రివెన్యూ మంత్రిగారికి తెలియజేశారు. కొన్నాళ్ళకు మద్రాసు ప్రభుత్వం అడవులను కొట్టకూడదని ప్రెస్ కమ్యూనిక్ ఒకటి యిచ్చింది. అయినప్పటికీ, గంపలగూడెం—చీమలపాడు — గొల్లపల్లి జమీందార్లు నిర్భయముగా అడవులు కొట్టించు చుంటున్నారు. చిట్టేల రైతులు మాత్రం తమ జమీందారుపై దావావేశారు. ఇతర ఎస్టేటు రైతులు కోర్టుచుట్టూ తిరిగే తాహతులేక, దావాలు వేయలేదు.

మొర్సపూడి నూజవీడు తాలూకాలో గొల్లపల్లి ఎస్టేటు గ్రామం. ప్రస్తుతపు జమీందారుగారి తండ్రి ఆ గ్రామరైతులకు 26 సంవత్సరాలక్రితం జరీబు య 1 కి 29 రూపాయల వరకు శిస్తుతో పట్టాలిచ్చి, మొర్సపూడి అడవి యందలి అన్‌రిజర్వు ఫారెస్టులో రైతులు తమ పశువులను, ఫీజు మాఫీగా మేపుకొనుటకును, కర్ర—కంప—కలప ఫీజు మాఫీగా తెచ్చుకొనుటకును; రిజర్వు ఫారెస్టులో మాత్రం యీ సౌకర్యములు ఫీజుకట్టి అనుభవించుటకును, పట్టా షరతులతో రైతులకు పట్టాలు వ్రాసియిచ్చారు. అప్పటినుండి రైతులు అషరతుల ప్రకారం అనుభవిస్తూవచ్చారు. కాని, ప్రకాశం కమిటీ రిపోర్టు ప్రకటింపబడగానే జమీందారుగారు అడవి నంతటినీ తమ ఆశ్రితకోటికిని. యితర గ్రామస్థులకును నజరానాలు తీసుకొని అమ్మివేసినారు. రైతులు గత్యంతరంలేక, ప్రకాశం గారి బిల్లుకొరకు వేయికళ్లతో ఎదురుచూస్తున్నారు

★ ★ ★

తునితాలూకాలో దుర్భర దరిద్రావస్థ.

తునితాలూకా కాంగ్రెసు అధ్యక్షులైన కామ్రేడ్ ఇనుగంటినారాయణరావుగారిట్లు వ్రాయుచున్నారు

తునితాలూకా అంతయు నీటిపారుదల సదుపాయములు లేక పంటలు పండక, రైతులు ఋణగ్రస్థులై, తమ భూములలో చాలాభాగం ఋణదాతలకు స్వాధీనం చేయవలసివచ్చింది. మదరాసు ఋణపరిష్కార చట్టం ప్రకారం రైతులు 1346 47 ఫసలీల తాలూకు జమీందారీశిస్తులు పూర్తిగా చెల్లించినచో, వెనుకటి బకాయిలన్నీ రద్దు అగుననీ, 1347 వ ఫసలీ శిస్తు 1938 సెప్టెంబరు నెలాఖరులోగాను, 1346 ఫసలీ శిస్తు 1939 సెప్టెంబరు నెలాఖరులోగాను, చెల్లించవలెననీ, ఉన్నది కాబట్టి రైతులు తమ వద్దనున్న పుస్తె, పూస యావత్తు అమ్మివేసి 1347 ఫసలీ పూర్తిశిస్తు మొత్తాలు చెల్లించివేశారు. కాని చెల్లించిన ఒక సంవత్సరములోనే 1939 సెప్టెంబరు నెలాఖరు కూడా వచ్చి మీద పడుతోంది. 1346 వ ఫసలీ శిస్తు సెప్టెంబరు నెలాఖరులోగా పూర్తిగా చెల్లిస్తేనే గాని బకాయి రద్దుకాదు. పై పెచ్చు, యీ సంవత్సరం హాలు శిస్తు కూడా యీ సెప్టెంబరులోగానే ప్రారంభము కానున్నది. ఇంతేగాక, యీ సంవత్సరం కాలమానముచూస్తే, అకుమళ్లు పూర్తిగా యెండిపోయి, కొన్ని గ్రామాలలో త్రాగుటకు మంచినీళ్లు అయినా దొరకుటలేదు. ఇట్టిపరిస్థితులలో రైతులు తమ భూములు యావత్తు వదలుకొనుటకు ఉద్దేశించుచున్నారు. ఎస్టేటు ల్యాండు ఆక్టు బిల్లు కనీసము ఈ అక్టోబరులోనైనా ప్రవేశపెట్టెదమని కాంగ్రెసు మంత్రులు ఒక ప్రకటన చేయకపోతే, ప్రజలు చెప్పరాని బాధలకు గురి కావలసివస్తుంది. చట్టము ఆలస్యమగుటచే, జమీందార్లు అవకాశము తీసుకొని, 1348 వ ఫసలీ తాలూకు శిస్తు బకాయిలకు కోర్టులలో దావాలువేసి రైతుల భూములు అమ్మించుచున్నారు. "కాంగ్రెసు పరిపాలనలో రైతు రక్షణ లేదా?" అని ఎన్నో ప్రశ్నపరంపరలు వచ్చుచున్నవి.

కాంగ్రెసు మంత్రివర్గం జమీందార్ల నిరంకుశత్వమును అరికట్టదలచుకొంటే, వెంటనే జమీందార్లు కోర్టులలోవేసే దావాలున్నూ, యీ సంవత్సరం హాలుశిస్తున్నూ, ఆర్డినెన్సుద్వారా ఆపవలసి యుంటుంది. లేనిచో ప్రజా దృక్పథము యితర విధములుగ మారే సూచనలు కనపడుచున్నవి.

★ ★ ★

రైతు—భూస్వామి తగాదా పరిష్కారము.

నడకుదురు గ్రామనివాసి ముమ్మిడి పట్టాభిరామయ్యగారు కాకినాడ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆఫీసుకు వచ్చి, తనకూ, భూస్వాములైన శ్రీబాదం సుబ్బారావు, కృష్ణమూర్తిగార్లకు మధ్య ఏర్పడిన తగాదాను గురించి స్టేటుమెంటు యిచ్చారు. శ్రీ బాదం సుబ్బారావు బ్రదర్సు తమ భూమిని శ్రీ డి. యస్. మూర్తిగారికి అమ్మకము చేయుచున్నట్లును, పట్టాభి రామయ్యగారికి యింకనూ రెండుసంవత్సరములు కవులు హక్కు ఉన్నప్పటికీ మూర్తిగారు రైతును తొలగించుటకు ఎన్నివిధములో ప్రయత్నములు చేస్తున్నట్లును, తెలియజేసారు. బీద రైతు పట్టాభిరామయ్యగారికి అన్యాయము జరుగునని సోషలిస్టుపార్టీ యీ వార్తను పత్రికలకు తెలియ జేసింది. కొద్దిరోజులైన తర్వాత భూస్వాములు శ్రీబాదం సుబ్బారావు బ్రదర్సు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ఆఫీసుకువచ్చి తగవు పరిష్కారం కొరకు కోరారు. రైతు, భూస్వాముల సమిష్టి సమ్మతిపైని కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ తరఫున కామ్రేడ్ సి. వి. కె. రావుగారు మధ్యవర్తిగా నియమింపబడిరి. మధ్యవర్తి తీర్పుకు రెండుపార్టీలు బద్ధులమై యుంటామని స్టాంపుమీద ముచ్చిలిక వ్రాసి యిచ్చారు. భూస్వాములు యీ దిగువ వివాదాంశములను చర్చకు తీసుకవచ్చారు.

1. రిజిష్టరు కవులు దస్తావేజు ప్రకారం, భూమి అమ్మకం చేసినపుడు రైతును తొలగించుటకు హక్కుకలదా, లేదా? (2) రైతు యివ్వవలసిన బకాయి రూ 900/- లున్ను, ప్రోనోటు బాపతు రు 50 లను రైతు చెల్లించుటకు బాధ్యుడా, కాడా?

పట్టాభిరామయ్యగారు, యీదిగువ వివాదాంశములను చర్చకు తీసుకవచ్చారు. (1) భూస్వాములు గట్టువేయుంచక పోవుటచే వెనుకటి సంవత్సరము నష్టమురాలేదా?(2) ముందు సంవత్సరములలో రైతుభూమిమీద తానుపెట్టిన 2,900రు పెట్టుబడి నష్టముకాలేదా?

(3) రైతుకుగల మిగతా 2 సం॥ల కవులు విడచిన యెడల ఎంత నష్టపరిహారము భూస్వాములు ఇవ్వవలెను?

కామ్రేడ్ సి. వి. కె. రావుగారు రెండు పార్టీల సాక్షులనూ దస్తావేజులను, అగస్టు 4, 5, 7 తేదీలలో వరుసగా విచారణ చేసారు. 8తేదీని తమ తీర్పును యిచ్చారు.

తీర్పులో, ముమ్మిడి పట్టాభిరామయ్యగారికి సదరు భూస్వాములు రూ 600/- ముజరా యిచ్చుటకున్నూ, యీనాందారులకు ఎట్టి తగాదాలు లేకుండా పట్టాభిరామయ్యగారు భూమిని వప్పజెప్పుటకున్నూ భూస్వామి కీయవలసిన 50/- ప్రోనోటుబాకీ అందు మినహాయించుకొనుటకును తీర్పు చెప్పారు.

సెప్టెంబరు 1

5 వ అఖిలభారత రైతు దినోత్సవం

రైతుసంఘాలు, రైతు పరిచారకులు, వారి సానుభూతిపరులు, ప్రజలందరు 5 వ అఖిలభారత రైతు దినోత్సవమును దేశమంతట జయప్రదముగా జరుపవలసినదని కొరుచున్నాను.

—స్వామి సహజానంద సరస్వతి,
కార్యదర్శి.
అఖిలభారత రైతు సంఘం.



# సుభాష్ బోసుపై ఆంక్ష!

## నాయకుల అభిప్రాయాలు

స్వరాజ్య పోరాటంయొక్క నేటి క్లిష్టదశయందు మన నాయకులుచేసిన యీ నిర్ణయంలో రాజకీయ దూరాలోచనగాని, నేర్పరితనంగాని, కనపడదు.

—స్వామి సహజానంద సరస్వతి,
(అఖిలభారత రైతు సంఘ కార్యదర్శి)

★ ★ ★

ఇక యిప్పుడు దేశీయు లనుసరించవలసిన మార్గం ఒక్కటే ఉంది. ప్రజా సంస్థల ద్వారా వారు పూర్వం కంటె యెక్కువ బలాన్ని సంపాదించుకొని, త్వరలోనే ప్రారంభించబడబోవు స్వాతంత్ర్య పోరాటానికి తయారు కావాలి.

—సతీశ్ చంద్ర బెనర్జీ.
అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడు)

★ ★ ★

కాంగ్రెసు సంస్థలో ఉన్న భేదాలు తగ్గడానికిబదులు యీ నిర్ణయం వల్ల ఎక్కువ అవుతాయి.

—జయప్రకాశ నారాయణ
(అఖిలభారత కాం. సో. పార్టీ కార్యదర్శి)

★ ★ ★

బాబు సుభాష్ చంద్రబోసుపై తీసుకో బడిన శిక్షణ చర్య చాలా దారుణమైనదని నా అభిప్రాయం. గాంధీ మహాత్మునిచే బోధించబడుతూన్న సత్య - అహింసా సిద్ధాంతాలకు అది యేవిధంగాను తగినదికాదు.

—సేలం విజయ రాఘవాచారియర్.
(పూర్వం ఒకప్పుడు కాంగ్రెసు అధ్యక్షుడు)

★ ★ ★

పరిస్థితులు యింకా విషమించక పూర్వం స్పెషల్ కాంగ్రెసును జరిపి, యీ సమస్యను చర్చించి, కాంగ్రెసు వాదులలో నిజమైన ఐక్యతను సమకూర్చడము అవసరమని నా అభిప్రాయం.

—ప్రొఫెసర్ రంగా.
(అఖిలభారత రైతుసంఘ ఉపాధ్యక్షులు)

★ ★ ★

అధికారములో ఉన్న మితవాద నాయకులు అతివాదులపై నల్పుతూన్న యీ దాడి రాబోయే యుద్ధము విషయములోను, ఫెడరేషన్ విషయములోను, సామ్రాజ్యవాదులతో రాజీ చేసుకోవడానికా?

—నిహారేందు దత్త మజుందార్.
(బెంగాల్ లేబర్‌పార్టీ కార్యదర్శి)

★ ★ ★

ఈ చిత్రవధకు ఫలితము కనపడకపోదు. దీనిద్వారా సుభాష్ బాబును ప్రజలు పూర్వముకంటె యెక్కువ ప్రేమిస్తారు.

—విశ్వంభర్ దయాళ్ త్రిపాఠీ.
(అఖిలభారత ఫార్వర్డు బ్లాకు కార్యదర్శి)

★ ★ ★

విచారించవలసిన విషయం యేమంటే. అక్రమ పద్ధతులవల్ల అధికారములోకి వచ్చిన అందరి మాదిరిగానే వర్కింగ్‌కమిటీకూడా నేడు గుడ్డిగాప్రవర్తిస్తోంది. సుభాష్ బోసును తన్నడమువల్ల తమ్ము తామే తన్నుకుంటున్నారు. కాంగ్రెస్ ప్రతిష్టను తన్నుతున్నారు. అంతేగాని ఏ ఒక వ్యక్తినీ కాదు.

—సర్దార్ శార్దూలసింగ్ కవీశ్వర్.
(పంజాబు కాంగ్రెసు నాయకుడు)

తీర్మానము తెలివితేటలతో చేయబడినదికాదు. ఇందువల్ల అనేక చిక్కులు సంభవిస్తాయి. "వార్నింగ్" యిస్తే సరిపోయి ఉండేది.

—ఎం. ఎన్. రాయి,
(అఖిలభారత రాడికల్ కాంగ్రెస్ లీగ్ నాయకుడు)

★ ★ ★

తాము అధికార పదవులలో ఉన్నాం కదా అనే ధైర్యంతో యితరులమీద కసి తీర్చుకుందాం అనే భావం యిందులో స్పష్టంగా కనపడుతోంది.

—మద్దూరి అన్నపూర్ణయ్యగారు,
(ఆంధ్రరాష్ట్ర ఫార్వర్డు బ్లాక్ ఆర్గనైజరు)

★ ★ ★

మితవాద నాయకుల గ్రామఫోన్ అనదగ్గ సత్యమూర్తి, ఫెడరేషన్ బాకాను గట్టిగా ఊదే ఆ లౌడ్‌స్పీకరు, కాంగ్రెసు తీర్మానానికి విరుద్ధంగా సంస్థానాధీశులతో బ్రిటిషు ప్రభుత్వానికి సహాయం చేయవలసిందనీ, ఫెడరేషన్‌ని ప్రతిఘటించవద్దనీ, బాహాటముగా చెపుతూంటే, దేశానికీ, కాంగ్రెసుకూ, ఆ విధముగా ద్రోహం చేస్తూంటే. ఎన్నిసార్లు వార్నింగులిచ్చినా లక్ష్యపెట్టక తన పాట తాను పాడుకొంటూ పోతూంటే. అది డిసిప్లిన్‌కి వ్యతిరేకంకాదు?

సుభాష్ బోసు

—కె. ఎఫ్. నారిమన్,
(బొంబాయి కాంగ్రెసు నాయకుడు)

★ ★ ★

దేశం కొరకు అన్ని త్యాగాలు చేసిన దేశభక్తుని యింత క్రూరంగా శిక్షించడము విచారించ దగిన విషయము.

—డాక్టర్ ఆరండేల్.
(దివ్యజ్ఞాన సమాజ స్థాపకులలో ఒకరు)

★ ★ ★

సుభాష్ చంద్రబోసు 3 సంవత్సరాల వరకూ ఏ కాంగ్రెసు కమిటీలోను ఉండకూడదని వర్కింగ్‌కమిటీ చేసిన నిర్ణయముతో కాంగ్రెసు సంస్థ నశించినదని చెప్పవచ్చును. ఈ విధానాన్ని అఖిలభారత కాంగ్రెసు మహాసభ అరికట్టి. యిప్పటి వర్కింగ్ కమిటీకి బదులుగా మరొక వర్కింగ్ కమిటీని, మెదడుతో ఆలోచించగలదాన్ని, ఎన్నుకోవలసిన సమయం వచ్చింది.

—శివప్రసాద గుప్తా.
(సంయుక్త ప్రాంతపు కాంగ్రెసు మితవాది)

బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో త్వరలో జరుగబోవు జాతీయపోరాటానికి ఐక్యత అవసరం, బోసును వెళ్లగొట్టడమువల్ల అతివాద, మితవాద శక్తుల మధ్యగల భేదాలు యెక్కువై, దేశముయొక్క పోరాట శక్తి సన్నగిలుతుంది.

—ఎం. ఎస్. అనీ.
(మధ్యపరగణాల కాంగ్రెస్ శాసన సభ్యుడు)

★ ★ ★

ప్రత్యక్ష పోరాటానికి ప్రజలను తయారుచేసే స్థితిలో నేటి కాంగ్రెసు నాయకత్వంలేదు. కేంద్ర ప్రభుత్వములో ఫెడరేషన్ ప్రవేశపెట్టబడునప్పుడు వారు దానిని ప్రతిఘటిస్తూ పోరాటాన్ని నడుపలేరు. యీ సూత్రాన్ని ఆధారముగా చేసుకొని మనం యిక పని చేయవలసియుంటుంది.

—దామోదర స్వరూప్, మోహనలాల్ గౌతమ్,
బి. పి. సిన్హా, జోగేష్ ఛటర్జీ.
(సంయుక్త ప్రాంతపు కాంగ్రెస్ సోషలిస్టు నాయకులు)

★ ★ ★

నేటి క్లిష్ట పరిస్థితులలో, ప్రపంచ యుద్ధం నేడో రేపో వచ్చి మీదపడే సమయంలో, భారతీయులందరు కలిసి సామ్రాజ్యవాదంతో అంతిమ పోరాటం సాగించవలసిన యీ నాడు, వర్కింగ్ కమిటీ యీ చర్య తీసుకోవడమువల్ల కాంగ్రెసులోను, కాంగ్రెసు బయట, ఉన్న విధ్వంస శక్తులకు, పోరాటాన్ని ధ్వంసముచేయ పూనుకొన్నవారికి, ఫెడరేషన్—యుద్ధ సమస్యలపై ప్రభుత్వముతో రాజీ పడాలని తహ తహ లాడే వారికి, ప్రోత్సాహం యిచ్చిన వారయారు....మనం మన శత్రువును చూచి పళ్లు పట పట కొరికాము. కాని ఆ శత్రువుతో కలియబడడానికి అవసరమైన ఐక్యతా బలాన్ని కోల్పోయాము. ఇప్పుడు శత్రువులు మనల్ని చూచి నవ్వరూ? 'కాంగ్రెసు మనతో కలియబడదు; మనల్ని యాచిస్తుంది' అని వారు భావించరూ?

....కాంగ్రెసు సాధారణ సభ్యులు ధైర్యంతో యిప్పుడు తమ అభిప్రాయాన్ని ప్రకటించాలి. విధ్వంసకరమైన యీ నిర్ణయాన్ని మార్చాలనువారినే రాబోయే కాంగ్రెసుకు డెలిగేట్లుగా ఎన్నుకోవాలి. కాంగ్రెసులోను నాయకుల్లోను, ప్రజలలోను, ఐక్యతకై పనిచేసే వారికే తమ వోట్లివ్వాలి.

—పి. సి. జోషీ, అజయ్‌ఘోష్, జి. అధికారి, ఆర్. డి. భరద్వాజ్.
(సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకులు)

★ ★ ★

శ్రీయుత సుభాష్‌చంద్రబోసుగారు ఆంధ్రరాష్ట్రమున సంచారము చేయు సందర్భమున వారికి సన్మాన పత్రముల నొసగుటకు కొన్ని కాంగ్రెసు సంఘములు తీర్మానించుట జరిగినది.

వార్ధాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కార్యసంఘమువారు శ్రీ సుభాష్‌చంద్రబోసుగారిపై క్రమశిక్షణ చర్య తీసుకొనినందున వారికి సన్మాన పత్రముల నర్పించరాదనియు, అట్టి సన్మానములందు పాల్గొన వలదనియు, కాంగ్రెసు సంస్థలను ఎన్నిక కాంగ్రెసు సభ్యులను హెచ్చరించుచున్నాను.

—గొ. బ్రహ్మయ్య,
(ప్రధాన కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ)

(ఇద్దరు పోలీసులు సహాయంగా వస్తారు. ఇంగ్లీషు ఆఫీసర్లు ధరించే బూడిదరంగు టోపీ పెట్టుకొని ఇత్తడి బొత్తాలున్న కోటువేసు కొనివుంటారు. ఒక ఆఫీసర్ పెద్ద కడుపుకి కోటు చాలాఇరుకుగాఉన్నది. తెల్లలాగు వేసుకొన్నాడు నడుముకు బెల్టు: ఒరలో కత్తి: తక్కిన ఇద్దరూ రెండు టోపీలు పెట్టుకొన్నారు. చేతుల్లో బెత్తాలుంటవి.)

పోలీసు

వాడెక్కడున్నాడు?

రెండో కళాసు

(నదివైపుచూసి) అక్కడ!

పోలీసు

ఏమిటనుకొన్నావు?

రెండో కళాసు

అమెరికను దొరగారు!

పోలీసు

ఆ పడవ ఎవరిది?

రెండో కళాసు

("ఛీ" బోటును చూపి) అదే!

పోలీసు

పడవవాడు ఏమయినాడు?

రెండో కళాసు

ఏమో తెలియదు.

(తెల్లవాళ్ళ కళాసు, ముగ్గురు తెల్లజాతి ప్రయాణీకులు చీనాన్ పడవనుండి దిగి ఓడలరేవు ప్లాట్ఫారంమీదికి వస్తున్నారు)

తెల్లవారి కళాసు

కళాసేదీ?

రెండో కళాసు

నాకేమీ తెలియదు, దొరా!

పోలీసు

(నదికేసిచూసి) అదేనా స్థలం?

తెల్ల కళాసు

నరకానికి పో! శని నిరగడ అయిపోతుంది, పచ్చవెధవా! కళ్లుండీ వెధవలు మీరే చేశారా ఈ పనంతా? హాయిగా పడవలో కూచున్నారు. (తెల్లవాళ్ల కళాసులు. నీళ్ళలో దిగే దుస్తులతో నదిలో మునుగుతారు. కూలీలు ఇటూ ఆటూ పరుగెడతారు. విలేఖరి పరుగెత్తుకొచ్చి రేవు ప్లాట్ఫారంమీద నిలబడి సహాయం చేస్తూ చప్పట్లు కొడతాడు)

విలేఖరి

బాగా ఎడమవైపు. ఇంకా మునగాలి ...లోతుకుపో, తిన్నగా వెతుకు నదిలో! అ!! పైకి తీశారు!! (నదిమీద అంతా అశ్చర్యపోతారు. తెల్లవారు ఆష్లే దేహాన్ని మోసుకొనివస్తారు.)

విలేఖరి

ఇక్కడికి తీసుకురండి! కింద పెట్టండి!

(ఆష్లే కోటు తీసివేస్తారు షర్టు వదులుచేసి కృత్రిమ పద్ధతిన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కలుగచేస్తారు. చైనావాళ్లు నిశ్శబ్దంగా ఉంటారు.

తెల్ల ప్రయాణీకుడు

(ఆష్లే భుజం కదిలిస్తూ) ఉహు, లాభంలేదు!

తెల్ల కళాసు

వాట్కిన్స్—సిగ్నలియ్యి.

వాట్కిన్స్

జెండాలేవి?

విలేఖరి

(చైనావాళ్ళవైపు తల ఊపుతూ) వాళ్ల చొక్కాలు జెండాలుగా ఉపయోగించండి. (వాట్కిన్స్ చొక్కా చింపి ముక్కలుచేసి పోలీసుల బెత్తాలకు కట్టి)

వాట్కిన్స్

ఏమని సిగ్నలు ఇయ్యను?

తెల్ల కళాసు

(ఆష్లే చెయ్యి ఎత్తి వదేసి) ఆష్లే చనిపోయాడు!

(వాట్కిన్స్ సిగ్నలు ఇస్తాడు)

మొదటి కళాసు

మళ్ళీ ఒకసారి చూదామా, దొరగారికి ప్రాణం వుందేమో? (దొరగారి వొంటిమీద ఇద్దరూ వంగిచూస్తారు)

(ఓడ సిద్ధముగా ఉంటుంది.)

'ఛీ' భార్య

(నదిమీద బోటుచూస్తూ గుండె చెదురుపోయే కేకవేస్తుంది.)

చూడు అది కదుల్తున్నది!

తెల్లవారి రెండో ప్రయాణీకుడు

(అడ్డంగా చూస్తు) అవును (కళాసు ఖంగారుతో పరుగెత్తుతాడు.)

తెల్లవారి మొదటి ప్రయాణీకుడు

(కొందర్ని పట్టుకోడానికి చప్పున ప్రయత్నిస్తాడు)

ఏయ్, ఆగక్కడ!

తెల్ల కళాసు

వదిలెయ్యి! వాళ్ళు దూరం పారిపోలేరు.

## నాలుగవ రంగం

స్థలం: చీనన్ తుపాకీ పడవ. వంతెన మీద కెప్టెన్ కాపర్ విస్కీగ్లాసు ముక్కలు ఇంకా కిందనే పడివుంటవి.

కెప్టెన్

(కోపంతో) నాస్నేహితుడు! తెల్లవాడు! వాళ్ళు ఎవరితో మెలిగేదీ మరిచిపోయి ఘాతుకపు పనిచేశారు!

కాపర్

(సన్నగా బిగ్గరగా ఆవేశంతో) పచ్చకుక్కలు! పాడువెత్త! వీళ్ళు పడవతెడ్లు యుద్ధసామగ్రిగా ఉపయోగిస్తారేం?

కెప్టెన్

(క్షణం ఆగి) మిస్టర్ కాపర్!

కాపర్

(మడిమలు రాచుకొంటూ నిలవబడి) ఏమండీ?

కెప్టెన్

శవాన్ని ఛర్చీ యార్డ్లోకి తీసుకు పోయేందుకు కొంతమంది గుంపును ఏర్పాటు చెయ్యి.

కాపర్

చిత్తం!

కెప్టెన్

సగౌరవంగా శవాన్ని తీసుకుపోయే ఏర్పాట్లుచెయ్యి.

కాపర్

చిత్తం! (సలాంచేసి నిష్క్రమిస్తాడు)

కెప్టెన్

ఏయ్ కుర్రాడా? సారా పట్టుకురా!

(కుర్రాడు సారా తెస్తాడు. కెప్టెన్ సారాతాగి, కుర్రాణ్ణి ఎగాదిగా చూసి, 'నేటివ్ కుక్కలు, అని సణుగుతాడు. సారా పూర్తిగా తాగి, గ్లాస్ కిందపారేసి కోపంతో పోతాడు. కుర్రాడు పగిలిన గ్లాస్ ముక్కలు ఏరుతాడు. ఓడడెక్ పై భాగం. బ్రూచ్లే, కాపర్ ప్రవేశిస్తారు. సోడాతాగే కాగితపు గొట్టం ఒక చేతిలోనూ గ్లాస్ రెండోచేతితోనూ పట్టుకుంటాడు)

బ్రూచ్ లే

నాకు మతిపోయింది, అయోమయంగా వుంది!

కాపర్

నేనూ అలాగే వున్నాను!

బ్రూచ్ లే

ఈ అమెరికా వాడివల్ల అందరం అలాగే ఉన్నాం.

కాపర్

అవును.

బ్రూచ్ లే

నా చేతుల్లోంచి జారిపోయాడు ఆష్లే - చవట! లొంగిపోతాడనుకొన్నాను ఆకస్మాత్తుగా.

# చీనా రోదనం

రచయిత:

త్రిషియోకోవ్

అనువాదం:

శ్రీ కృత్తివాసతీర్థులు

(నవ్యసాహిత్య పరిషత్తు)

## పాత్రలు

★ తెల్లవాళ్లు

కెప్టెన్—'చీనన్' తుపాకీ పడవ
లెఫ్టనంట్ కాపర్
బ్రూచ్లే, అతని భార్య, కుమార్తె కార్టీలియా—ఫ్రెంచి వ్యాపారులు
ఆష్లే—అమెరికా కంపెనీ ఏజంటు
మిషనరీ, బోటువాడు, నావికులు
అమెరికన్ పత్రికా విలేఖరి
ప్రయాణీకుడు, అతని భార్య

★ చీనావాళ్లు

డాయిన్—జమీందారు
తాయ్లీ—ధనిక వ్యాపారి
ఛీ—బోటువాడు, భార్య, కుమార్తె
ఫీ—కళాసుల యూనియన్ చైర్మన్, వాడి భార్య
విద్యార్థి—డాయిన్ తరపున దొరలతో ఇంగ్లీషు మాట్లాడుతాడు
ముగ్గురు కళాసులు, ఒక ముసలి కళాసు
రెండో కళాసు భార్య, కొడుకు
అమా—తెల్లవాళ్లకు వార్పుడుకత్తె
హొషాంగ్—చైనా జాతీయ సన్యాసి
రేడియో స్టేషన్ కొలిమి కూలీ
తెల్లవారి పడవమీద పనిచేసే కుర్రవాడు
పోలీసు, ఊరివాళ్లు

కాపర్

అయిపోయిందతని పని! (ఖంగారుగా)

బ్రూచ్ లే

ఏమిటి? చచ్చిపోయాడా? అదే గోల?

(ఆందోళనలో సోడాతాగే గొట్టం నొక్కేస్తాడు)

(కాపర్మీద సోడా బిందువులు పడతవి)

కాపర్

ఖంగారువద్దు! జాగ్రత్తండీ! (ఒకసారి అసందర్భంగా గంతేసి బ్రూచ్లేసతి, కార్టీలియా వస్తుంటే గుడ్డిగా అయోమయంగా నడుస్తాడు) క్షమించాలి నన్ను!

బ్రూచ్ లే సతి

(భర్తతో) ఏమిటా వెర్రికేకలు? ఆ హడావిడి?

బ్రూచ్ లే

ఆయ్యో ఎంత పని జరిగిందని! ఆష్లేని చంపేశారు!!

కార్టీలియా

అయ్యో! చచ్చేవాడితో నాట్యం చేశాను!

బ్రూచ్ లే సతి

ఎవరాయనను చంపింది?

కాపర్

ఒక కళాసు

బ్రూచ్ లే సతి

ఎంత పని?

బ్రూచ్ లే

(తనలో కళ్ళనీళ్ళ పర్యంతంగా) ఇవాళ ఆష్లే! రేపు నేనేమో, మర్నాడు మీరంతా!

(కాపర్ నిష్క్రమిస్తాడు)

బ్రూచ్ లే సతి

ఇస్! ఇస్! ఏమిటి మాట్లాడుతున్నారు?

బ్రూచ్ లే

చైనావాళ్లు విప్లవోద్రేకంతో బయలుదేరినారంటే వాళ్ల మత గురువుల్ని చంపేస్తారు.వ్యాపారంచేసే షాహుకార్లను మట్టం చేస్తారు. జపాను వస్తువులు బహిష్కరిస్తారు. నిన్న షాంగ్హైలో చీనావాడు కర్రతో తెల్లవాణ్ణి చావగొట్టాడు: పికెంగ్లో తెల్లసోల్జర్ ముఖంమీద ఇంకోడు వాయించాడు!

కార్టీలియా

(చీదరింపుతో) ఎందుకు?

బ్రూచ్ లే

ఎందుకంటావా? యూరపియన్ పార్కులో ఈ పచ్చ పరువుల్ని నడవనియ్యలేదనిట. వెధవ సుఖరోగాల పుట్టలు ఈ నేటివులు!!

బ్రూచ్ లే సతి

(భర్త అసభ్య భాషణం విని తుళ్ళిపడి) మైడియర్! అమ్మాయి ఎదట మీరేం చెబుతున్నారో దేవుడి కోసం అయినా గమనించండి!

బ్రూచ్ లే

చైనావచ్చి ఇరవయ్యేళ్ళయింది. ఇరవయ్యేళ్ళపాటు నీళ్ళులేని చేప లాగు నానా అవస్థలు పడ్డాను. ఈ నేటివు దొంగల మధ్య కీళ్ళ నొప్పులతో జ్వరంతో—చైనా వాళ్ళంతా నాజేబులో ఉన్న డబ్బు కాజెయ్యాలని, కత్తితో హడల గొట్టాలని ప్రయత్నించేవాళ్లు. తల్చుకుంటే పది నిమిషాలలో నా తల పగలగొట్టగలరు!

బ్రూచ్ లే సతి

మైడియర్, అలా మాట్లాడకండి, అంత ఖంగారు వొద్దు!

భర్త

నన్ను వొంటరిగా వదిలెయ్యి. ఊరుకోలేవూ? లేకపోతే. పారిపో!

కార్టీలియా

ఖూనీ చేసినవాణ్ణి విచారణ చెయ్యరా?

బ్రూచ్ లే

(కటుగ్గా) ఒకటి మాత్రం నిజం. హత్యచేసినవాడు ఎప్పుడో పారిపోయి వుంటాడు. (ఉద్రేకం) తక్కిన వాళ్ళని వదలడం ఏం బాగా లేదు. (సోడా తాగే కాగితపు గొట్టం విసిరి వేస్తాడు) లేకపోతే మన పీకలు ఎగిరిపోతాయి.

కార్టీలియా

(సంభాషణ వశాన) పడవలన్నీ ఊళ్లోంచి వస్తున్నాయి, చూడు!

బ్రూచ్ లే సతి

(భయంతో భయపడుతున్న భర్తచెయ్యి పట్టుకొంటుంది) అమ్మో, చైనావాళ్లొస్తున్నారు!

కార్టీలియా

(విచారంగా) కాదు! తెల్లవాళ్లు!

(బ్రూచ్లే కూర్చుని తాగుతాడు. కళాసులకు ఉత్తరువులిచ్చే కాపర్ గొంతు శబ్దం వినపడుతుంది. నెరసిపోయిన ముసలి మతగురువు పారిపోయి బ్రతుకు జీవుడా అని వస్తాడు. కాపర్ ఆయనతో వుంటాడు. కాపర్ లోపలికి, బయటికి నడుస్తూ, చైనావాళ్ళ ధాటి తప్పించుకొని వచ్చిన వాళ్ళకు స్థలపరిచయం చేస్తాడు)

మిషనరీ

లెఫ్టనెంట్! నన్ను క్షమించాలి. ఈ ఊళ్ళో ఉండడం ప్రమాదకరము.

బ్రూచ్ లే

నువ్వు చెప్పినమాట నిజం!

మిషనరీ

(కుర్చీలో కూలబడి విచారంతో) ఎంత భయంకరం! ఎంత దారుణం! (ముందుకు వంగి) పాపం ఆష్లేదొరను బాధపెట్టి, వేళాకోళం చేసి, అవమానం కలిగించి, చివరకు నదిలో ముంచారని తెలిసింది. ఈ తప్పు దండన లేకుండా పోతుందా?

బ్రూచ్ లే సతి

(మేరీ మాగ్దలెన్ క్రీస్తుతో మాట్లాడిన కంఠంతో) మీమీదకూడా కన్నేసి హతమారుస్తారేమో! (క్షణం నిశ్శబ్దం. రాబోయే క్రూరదృశ్యాలు తలుచుకొంటుంది.)

మిషనరీ

అవునవును!

(తెల్లజాతి ప్రయాణీకులు ఇద్దరు పెద్ద పెట్టెలోనూ ట్రంకులోనూ దాగి ఉంటారు. ప్రయాణీకుడు, అతని భార్య, వస్తారు. ఆమె టోపీ, కెమెరా, చేతులో పట్టుకునే ఉన్నది.)

ప్రయాణీకుడు

(నివ్వెరపోయి) మైడియర్! కిందపెట్టు వాటిని!

భార్య

నన్ను వదలండి. హంతకులెవరో వున్నారని వాళ్ళకోసం భయపడి టోపీ, కెమిరా చేత్తో పట్టుకోకూడదా?

ప్రయాణీకుడు

సరేకానీ....

భార్య

ఉండండి, కెప్టెన్ ఎక్కడున్నాడో వెతికివస్తాను! ఆయన మనల్ని బాగా అర్థం చేసుకొంటాడు. ఆయనే మనల్ని రక్షించగలడు.

ప్రయాణీకుడు

(కాపర్తో) అఫీసర్! హత్యజరిగిన మాటనిజమేనా? పట్టపగలు! ముగ్గురు అమెరికావాళ్ళని!

భార్య

(అడ్డువచ్చి) ఏడుగురు దొరలు, ఇద్దరు దొరసానులు అని నాకు చెప్పారు.

భర్త

పడవల్లోకి లాగి చంపేశారట వాళ్ళని!

భార్య

(లేసతినిచూచి సన్నగొంతుతో) అమ్మోభయం! అమ్మోభయం! భయంవేస్తున్నది!

లేసతి

అమ్మోభయం! భయం! (ఆవిణ్ణి కౌగలించుకొంటుంది)

లే

ఉండండి, ఇది ఇంకా ప్రారంభ దశ!

ప్రయాణీకుడి భార్య

(కాపర్తో) మమ్మల్ని వదిలెయ్యరుకాదూ (భర్తతో కోపంతో) నేనెప్పుడూ చెప్పేదాన్ని చైనావెళ్ళితే ఏమవుతుందో? మీ పట్టువల కొద్దీ చైనా వచ్చాము.

ప్రయాణీకుడు

మైడియర్, నాకేం తెలియదు!

భార్య

వాళ్లు నన్ను పట్టుకుంటారనుకోండి.

(ప్రయాణీకుడు విచారంతో నిట్టూర్పు)

భార్య

నోటమాటరాకుండా నా నోట్లో గుడ్డలు కుక్కుతారేమోనూ!

ప్రయాణీకుడు

నిజంగానా?

భార్య

బలవంతంగా నన్ను వ్యభిచరిస్తారు!

# ధామీ సంస్థాన ప్రభువు తనచేతితో ప్రజలనుకాల్చాడు

## సంస్థాన దుండగాలకు బ్రిటిషు ప్రభుత్వమే కారణం

ధామీ సిమ్లా సమీపంలో ఒక చిన్న సంస్థానం. జులై 16 వ తేదీన ధామీ సంస్థాన ప్రభువు, పోలీసులు ప్రజలను అతి క్రూరంగా లాఠీచార్జి చేసి, రాళ్లువేసి, తుపాకులు కాల్చారు. తుపాకుల కాల్పుల ఫలితంగా నలుగురు చనిపోయారని 17 వ తేదీ వార్త వచ్చింది. సంస్థాన ప్రభుత్వపు ప్రకటనలో ఒక్కరే చనిపోయారని ఉంది. అనధికార విచారణ కమిటీవారు "కనీసం యిద్దరు చనిపోయారని" నమ్ముతున్నది చాలామంది ఇండ్లువదలి పారిపోయారు భయంవల్ల.

### సంస్థాన ప్రభుత్వ ప్రకటన

"ఠాగ్‌మాల్ సౌధా "హిమాలయ రియాసత్ ప్రజామండలి" యొక్క సిమ్లా శాఖకు కార్యదర్శి, జవ్వాల్ స్టేటు నివాసి. అతడే ఊరేగింపుకు నాయకత్వం వహించాడు. ధామీలోని ఒక గ్రామంలో "ఘున్నాకి హత్తి" వద్ద 16 వ తేదీ 1½ గంటలకు సంస్థానంలోకి అడుగుపెట్టవద్దని ఆర్డరు చూపించారు సంస్థాన పోలీసులు. కాని అతడు ఉల్లంఘించడంవల్ల, అరెస్టుచేయబడ్డాడు. సంస్థాన ముఖ్యపట్టణమైన "హాలాగ్"కు తీసుకు పోబోయారు. అది 8 మైళ్లు దూరం ఉంది. ప్రజలు అతన్ని వెంబడించారు, "హాలాగ్" వచ్చేసరికి 2 వేల మొదలు 3 వేల దాకా ప్రజలు ప్రోగయ్యారు. 4 వేలంటారని ఠాగ్‌మాల్ సౌధాయే చెప్పాడు. పోలీసు ఠానాకి 150—200 గజాలలో నున్న రాజభవన సింహద్వారంవద్ద, ఒక సార్జంటు, ఒక హెడ్ కానిస్టేబుల్; 3 గురు ఇతర పోలీసుల్నీ నిలబెట్టారు. వాళ్ల వెనకాల 15 గజాల దూరంలో ఇంకో ఆరుగురు "షాట్ గన్"లతో నిలబడ్డారు. (మూడేసి, అందులో రెండేసి ఖాళీవి.)

"ప్రజల గుంపు సమీపించగానే, రానాసోదరుడు రతన్‌సింగు ముందుకువెళ్లి ప్రతినిధుల పేర్లను అడిగాడు. రానాసంతోష పూర్వకంగా దర్శన మిస్తారన్నాడు. హీరాసింగ్ నాయకత్వంక్రింద ప్రతినిధుల పేర్లు సూచింపబడ్డాయి. హీరాసింగు కూడ ఈ సంస్థానవాసికాడు. రానా సోదరుడు, సిమ్లాలో ప్రకటించ బడ్డట్లు ప్రజలపై కాల్చలేదు.

"ఇంతలోకే ఖైదీని ప్రజల ముందుగా తీసుకపోయారు. ఇంతలో కొందరు తమ నాయకుని తీసుకు పోతున్నారనీ, ఆపాలనీ కేకలు వేశారు. కొందరు దాదాపు 60 మంది దాకా వారి వెనుక ఉన్న పోలీసులపైన రాళ్లు వేసారు. ఖాళీ తుపాకుల కాల్పుమని మేజిస్ట్రేటు ఆర్డరిచ్చాడు. కాని ప్రజలు భయపడలేదు. చివరకు నిజమైనవే కాల్చారు. మొత్తం 5 నిమిషాలకన్న కాల్పు లుండలేదు. 22 నిజమైన గుండ్లు, 12 ఉత్తవి కాల్చబడ్డాయి ప్రజలు బెదరి పోయాక, దుర్గ అనేవాడి శవం కనబడింది. పొలిటికల్ ఏజంటుతోపాటు, ధామీవచ్చిన డాక్టర్ పరీక్ష చేశాక శవం బంధువుల కప్పగించ బడింది. ఇంకొకణ్ణి ప్రజలు విడిచిపెట్టి పోయారు. అతన్ని గూడ దగ్గర ఉన్న ఖాణ్డీ సంస్థానంలోని 'సునీ' ఆస్పిటల్‌కు పంపించింది దర్బారు.

"సిమ్లా ఆస్పిటల్‌లో 24 మందికి చికిత్స చేశారు. 7 గురిని మాత్రం 'ఇన్‌పేషెంట్లు'గా తీసుకొన్నారు. రైఫిల్‌గాని తుపాకిగుండ్ల వల్ల గాయపడ్డ వారెవరూ లేరు సంస్థాన ప్రజలు (11 గురు) లాఠీలకు, రాళ్ళదెబ్బలకు గురిఅయినవారు చికిత్స చేయబడ్డారు కాబట్టి మొత్తం, చనిపోయినది ఒకడూ, గాయపడింది 40 మంది.

#### ఆందోళన

"ధామీ రియాసత్ ప్రజామండలి" కార్యదర్శి అనే పేరు చెప్పుకున్న ఒక మనిషి 14 వ తేదీన ఒక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలో బెదరింపు ఉంది. కొన్ని కోర్కెల గోరుతూ: బాధ్యతాయుత ప్రభుత్వం కావాలనీ. 100 కి 50 చొప్పున రెవిన్యూ రిమిషను కావాలనీ కోరారు. ఇవి ఈయకపోతే, ఠాగ్‌మాల్ సౌధా 16 వ తేదీన రాణాను సందర్శించుతాడనీ ఆ ఉత్తరంలో ఉంది. దాని కాపీ పొలిటికల్ ఏజంటుకు పంపబడింది. ఈ మండలినిగాని, ఈ విప్లవ కోర్కెలనుగాని ఇదివరకెన్నడు సంస్థానం వినలేదు. వ్యక్తిగతంగా ఇబ్బందులు తెలుపుకోడమే గాని, ఇదివరకెప్పుడూ 'సమూహంగ' కోర్కెలడగటం లేదు. ఇంతేగాక 'పర్వత సంస్థాన అధిపతులు" తమ ప్రజల ఇబ్బందుల తీర్చటం పత్రికలో నడిపే ధామీ సంస్థానానికి సంబంధం చని కొందరు హఠాత్తుగా ఆందోళన సాగించారు. బలహీనమైన ఈ సంస్థానంచేత సులభంగా సంస్కరణల వాగ్దానం పొందవచ్చునని, తర్వాత ప్రజల్లో గొప్పగా చెప్పుకోవచ్చుననీ వారు తలచారు.

#### చట్టబద్ధ ఆందోళనగాదు.

"2000 మంది కాంగ్రెస్ జండాలను మోస్తూ, కర్రల బుచ్చుకొని సిమ్లావచ్చారని అన్నిచోట్లా తెలిసింది. సంస్థానపు సరిహద్దులలో వాటిని వదలివేశారు. సంస్థాన ప్రజలంతా కలసి 5,232 మంది. సంస్థానానికి ఉన్న పోలీసులు 21 మంది. 6 గురికి మాత్రం షాట్‌గన్‌లున్నాయి. కాబట్టి ఈయాత్ర సాగించిన వారి ఉద్దేశ్యం అహింసాత్మకంగా చట్టబద్ధంగా ఆందోళన చెయ్యడంకాదు. పారిపోయిన ప్రజలను జైల్లో వేస్తామని, బాధపెడతామని కొందరు చెబుతున్నారు. అలాంటిదేమీ జరగదు."

ఈవిధంగా, అతిశయోక్తులతో, కల్లిబొల్లి మాటలతో సంస్థాన ప్రభుత్వం ప్రకటించింది. ప్రజలపై నేరం మోపింది. ప్రిన్సెస్ ప్రొటెక్షన్ ఆక్టు క్రింద సిమ్లాజిల్లా మేజిస్ట్రేటు సిమ్లా సరిహద్దులలో 2 నెలల వరకు 5 గురుకన్న ఎక్కువ గుమికూడరాదనీ, ధామీ, కోటీ సంస్థానాల్లో ఎవరూ ప్రవేశించరాదనీ నిషేదించాడు.

### ప్రజామండలి కార్యదర్శి ప్రకటన

హిమాలయా రియాసతీ ప్రజామండలి కార్యదర్శి ఈక్రింది ప్రకటన గావించాడు.

"ప్రభుత్వ ప్రకటనలోనే అప్పుడపుడూ వ్యక్తిగతంగా ప్రజలు తమ కష్టాలు చెప్పుకుంటున్నారని ఉన్నది. ఇదే రాణా నిరంకుశ పరిపాలన తెల్పుతుంది.

తమ కష్టాలు తీరనందున "ధామీ ప్రేమ్ ప్రచారణీ సభ" పేరిట వందలకొలది ప్రజలు సంఘటితులయారు. ఈ సభ ఉద్దేశ్యాలు: కష్టాలు తీర్చుకోవడమేగాక సంస్థానంలో లేని వైద్య సహాయం, విద్యనుకూడా సమకూర్చడం.

#### ప్రజామండలిపై రాణా దూషణ.

"ప్రేమ్ ప్రచారణీసభ, చాల సభలుచేసి, తమను గుర్తింపవలసిందని, నిబంధనలతో కూడిన ఒక కాపీని రాణాకు పంపారు. కాని అది అందినట్లుకూడా జవాబులేదు. నిరాశచెంది జులై 13 వ తేదీన సిమ్లాకు సమీపంలో సభ జరిపారు. 600 మంది హాజరయారు. ఇక్కడే పేరుమార్చి "ధామీరియాసత్ ప్రజా మండల్"అని పేరుపెట్టారు. ఈకోర్కెలు కోరుచూ తీర్మాలు చేయబడ్డాయి. (1) బాధ్యతాయుత ప్రభుత్వం, (2) పౌరసత్వపు హక్కులు, వాక్స్వాతంత్ర్యం (3) ప్రజామండలిని గుర్తించటం (4) 3 సంవత్సరాలనుండి పంటలు లేనందున 100కి 50 చొప్పున రిమిషన్ (5) బేగార్ (వెట్టి)ని నిషేధించడం (6) లాక్కొన్న భూములు తిరిగి ఈయడం (7) సంస్థానంనుండి వెళ్లగొట్టబడినవారిపై నిషేధం తొలగించి, అనుమతికి అజ్ఞ ఈయడం. ఇంకో తీర్మానంలో ఈ కోర్కెలను రాణాతో విన్నవించడానికి రాయబారవర్గపు పేర్లను సూచించారు.

ఠాకూర్ భాగమల్‌సౌధా, హిమాలయ రియాసత్ ప్రజామండలి కార్యదర్శి. ధామీ మండలి,దానిఉపశాఖ. అనుభవంగల నాయకుడగుటచేత అతన్ని నాయకత్వం వహించమన్నారు, అతడంగీకరించాడు.

ధామీ కార్యదర్శి 14 వ తేదీన ఈకోర్కెలు అర్జెంటు అనీ సమాధానం పంపమనీ మనిషి ద్వారా ఒక ఉత్తరం పంపాడు. సమాధానం రాకపోతే జులై 16 న సాయంత్రం 3 గంటలకు రాయబారవర్గం వేచియుంటుందని తెలియ చేశాడు.

#### రాయబారం బెదరింపుకు కాదు.

"ఈ ఉత్తరం బెదరింపు అంటూ ప్రభుత్వం ప్రకటించింది. అల్టిమేటము కాదు. సమాధానం రాకపోతే రాయబారం వెళ్లడం మా హక్కని రాణానుదర్శించేహక్కు. ఎంత చిన్న వ్యవధి అయినా, ఉందనీ తలచాం. ముఖ్యంగా రెవిన్యూ విషయం చాలా అర్జెంటయినది. మేం శాంతంగా ఉండాలనే ఉద్దేశ్యం. చివరిదాకా అలా ఉన్నాంకూడా.

#### జాతీయ పతాకాన్ని తగులబెట్టారు.

"నారాయన్‌దాస్ (తుపాకిగుండ్ల దెబ్బవలన రిపన్ ఆస్పిటల్‌లో ఉన్నాడిపుడు) మండి జాతీయ పతాకాన్ని, "ఘునాకీ హత్తి" వద్ద తగలబెట్ట బడింది. ఇది ప్రజల్ని రెచ్చగొట్టడానికి. కాని ప్రజలు శాంతియుతంగా ఉండి మరో జండా ఎత్తారు. తర్వాత ఆ బూడిదను మరునటి రోజు సిమ్లా బహిరంగసభలో కూడ ప్రభుత్వ దౌర్జన్యాన్ని చూపించడానికి తీసికెళ్లారు కూడ.

ధామీ చుట్టు ప్రక్కల సంస్థానాలలో ఠాకూర్ భాగమల్ అరెస్టు చిచ్చులా వ్యాపించింది.

#### చేతికిన్ని సంకెళ్లు

"ఆయనకు సంకెళ్లు వేశారు, ఈ చుట్టు ప్రక్కల అన్ని సంస్థానాలకు ఒకే నాయకుడు. ఆందోళన కలిగి ప్రజలు వచ్చారు. ప్రభుత్వం 'హాలాగ్' వచ్చేసరికి 2 లేక 3 వేలమంది ఉంటారని లెక్కవేసింది.

#### పోలీసుల ప్రవర్తన

"ప్రభుత్వం "స్ట్రాటిజిక్" అనుకొనే స్థలంలో లాఠీలు, రాళ్లగుట్టలు, చాలా తుపాకులు కన్పడ్డాయి. ప్రజలు ఇరుకు సందుగుండా నడుస్తుంటే తుపాకులు పేల్చడం వాళ్లకు సులభమయింది.

"ప్రజలు ఈ ఘటన జరిగిన స్థలానికి చేరి రాయబారవర్గాన్ని పోనీయమని అడిగారు. పోలీసులకు ఒక పేర్లజాబితాకూడా ఇచ్చాం. ఇది చేరకముందే పోలీసులు ప్రజలను బలవంతముగా చెదరగొడుతూ, ఖైదీని తీసుకుపోబొచ్చారు. దానివలన కొందరు క్రిందపడ్డారు. ఠాకూర్ భాగమల్‌నుకూడా పడేసి ఈడ్చారు. పోలీసులు, ప్రజలలోగుండా బయటకువెళ్ళక, లాఠీచార్జీచేసి రాళ్లు విసిరారు పోలీసులు.

#### రాణా తన చేతులతో కాల్చాడు.

"చాలామందికి దెబ్బలు తగిలి గోలచేయ ప్రారంభించారు. రాణాయే స్వయంగా కాల్చడం ప్రారంభించాడు. ఇది చాలామంది ప్రజలు చూచారు. ఇంకా అతని బంధువులు కూడా కాల్చారు. చాలామంది పడిపోయి ఆక్రందనం చేయసాగారు. ప్రజలు నలుదిక్కులా పరుగెత్తసాగారు. గాయపడినవారికి సహాయం చేయబోయిన వారినికూడా కాల్చారు. తమకు దొరికినవారిని మాత్రం మోసుకొని, సిమ్లాపరిగెత్తారు ప్రజలు. ఏదో కొట్లాట జరిగిందని హింస చేసారని ప్రభుత్వం ప్రకటించిన ప్రకటన వట్టి కల్పన."

### మహాత్ముడు-జవ్హార్లాల్

ధామీ సంస్థానవాసులగు (1) రాజకుమారి అమృతకౌర్ (2) మిస్టర్ శామలాల్ (సిమ్లా కాంగ్రెస్ అధ్యక్షుడు) (3) యస్. ఆర్. శర్మ (ధామీ ప్రజామండలి కార్యదర్శి)గారలు గాంధిగారిని జులై 27 వ తేదీన కలిసికొని 45 నిమిషాలు మాట్లాడారు, గాంధిగారు తానేమీ చేయలేననీ, జవహర్‌లాల్‌ను కనిసికోమనీచెప్పాడు.

వీరు జవహరుతో సంప్రదించారు. సంస్థాన ప్రజామండలి అధ్యక్షుడయిన జవహర్‌లాల్ ఒక ప్రకటన గావించాడు.

"సంస్థానాలలో, ప్రజలను కాల్చి చంపడం సాధారణం అయింది. సామ్రాజ్య సిమ్లా నీడల్లోనే ఈ సంస్థానం ఉంది. ఇది చిన్న సంస్థానం. ఇక్కడ ఒక స్కూలన్నా లేదు. ఆస్పిటలన్నా లేదు.

"నిర్బంధపు వెట్టి, అక్రమవసూళ్ల భారమైన పన్నులు ప్రజల్ని కృంగదీస్తున్నది. ఫ్యూడలిజానికి చిహ్నంగా సిమ్లా దగ్గరగా ఉన్న ఈ సంస్థానం ఇండియాలో సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి గల సంబంధం తెల్పుతుంది. ప్రజలు కోర్కెలు విన్నవించడానికి పోతే

(మిగతా 16 వ పేజీలో)



# అయోధ్యలంక మునసబుపై లంచగొండితనపు కేసు

కామ్రేడ్స్ అల్లూరి సత్యనారాయణ, పేరేప మృత్యుంజయుడు, గారలు యీవిధంగా వ్రాయుచున్నారు:

నర్సాపురం తాలూకా భీమలాపురం శివార్లు అయోధ్యలంక, పుచ్చల్లంక గ్రామాలకు మైనర్ డిప్యూటీ మునసబుగారైన పోశంశెట్టి సుబ్బారావుగారు పైగ్రామాల రైతాంగము నుండి సుమారు 6, 7 సంవత్సరములనుండి అనగా ఆయన మునసబుహోదా తీసుకొన్నప్పటినుండి లంచములు తీసుకొనుటలో చేస్తూవచ్చిన వాటినాలు కాంగ్రెసు ప్రభుత్వానికి, ప్రజాసామాన్యానికి తెలుపుట కాంగ్రెసువాదులమైన మా విధి అని తలంచి క్రింది వివరముల తెలుపుచున్నాము:

సదరు మునసబుగారు శివార్ల మునసబు అగుటవల్ల, అవి ఎక్కువ పాటలంకలు అగుటవల్ల రైతులను బెదరించి సుమారు సంవత్సరమునకు రు 2000-0-0 లు లంచముగా తీసుకొనుచున్నాడు. అక్కడనున్న రైతాంగము కడు బీదలున్ను, ఎక్కువ నిమ్నజాతీయులున్ను, అగుటవలన వారు ఇంతవరకు అధికారులకు చెప్పుకొనుటకుకూడా భయపడి ఊరకుండిరి. లంచములు తీసుకొనుటలోచేయు దారుణములు వర్ణనాతీతములు. పన్ను చెల్లించుటకు ఏరైతైన వస్తే పన్ను పుచ్చుకొని, అందులో మామూలుగా తాను పుచ్చుకొను లంచము మినహాయించి, మిగతానన్ను తీసుకురమ్మని నిర్బంధపెట్టి ఆడబ్బు తీసుకువచ్చేవరకు రశీదుఇవ్వడు. చిఠాకు అనలే జమకట్టడు. ఈటక్కుబాపతు లంచమైతే పోనీ అనుకుందాం. జనన, మరణపు నమోదులలోకూడ లంచములే. ఎవరికైన శిశువు పుట్టినచో మునసబు నౌకర్ల ద్వారా దరియాప్తు చేయించవలసినదిపోయి రైతులే స్వయముగావచ్చినను (సకాలములో) రేపురా, మాపురా, అని 4 రోజులు జరిపి 5 వ రోజున చెప్పవలసిన కాలం దాటింది, కేసు పెట్టమంటావా లేకపోతే నామాటేమిటని అడుగుతాడు. అమాయకులు, బీదలైన రైతులు కేసు పెడితే నర్సాపురం తిరగాలేమోనని భయపడి 2, 3 రూపాయిలిచ్చి బతిమాలుకుంటే అయ్యగారు బెట్టుసరితో అంగీకరిస్తాడు. ఇంతేకాదు, ఏనేరమైన జరిగితేకూడ రిపోర్టు తానుచేయక రిపోర్టు చేయుటకువచ్చిన ఫిర్యాదినద్ద బాగా వ్రాస్తానని లంచము తీసుకొనుట, రిపోర్టు చేయనని ముద్దాయివద్ద ఎక్కువగా గుంజుట, ఆ మహనీయునకు మామూలే. దీనివల్ల దొంగలు, రౌడీలు మునసబుగారి బంటులై వారి దారుకాలకు సాయపడుతున్నారు.

ఈ దారుణాలు రైతులు సహించలేక, శ్రీ నర్సాపురం సబుకలెక్టరుగార్కి సాక్ష్యములు చెప్పుటకు వెరచి కిస్తీ రోజులలో రహస్య విచారణ జరపమని కోరుచు పిటీషను పెట్టుకొన్నారు. కలెక్టరుగారు నర్సాపురంతాలూకా తహశ్శీలుదారుగారిని విచారణాధికారిగా నియమించిరి. సదరు విచారణాధికారి 19-5-39తేదీని నర్సాపురం వాయిదావేసి విచారించకయే తిర్గి 30-5-39 తేదీకి భీమలాపురం ముకాంలో వాయిదావేసిరి. ఆనాడు మేము వేరేపనిమీద అచ్చటకు వెళ్లితిమి. ఆ వాయిదాకు సుమారు 400 మంది రైతులు అచ్చట గుమిగూడి యుండుట చూచి, విశేషమేమని అడిగితిమి. అంతట మునసబు లంచగొండితనమును గూర్చి ఈ రైతులు పిటీషను పెట్టిరనీ, తహశ్శీలుదారుగారు ఆనాడు అచ్చటకు వచ్చెదరనీ, చెప్పిరి. మండుటెండలలోకూడ అంతమంది రైతులు వచ్చుటచూచి ఆశ్చర్యపడి మేముకూడ ఆగితిమి. కాని విచారణాధికారి రాలేదు. రైతులు పాపం సాయంత్రము వరకు వేచియుండి నిరాశతో తిరిగి వెళ్లుచుండగా మేమువారికి ధైర్యముచెప్పి తిరిగి వచ్చితిమి. ఆమాదిరి పిటీషనే నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీకికూడ 30-5-39 ని చేరినది. దానిపై కాంగ్రెసు కమిటీ మమ్ములను విచారించుటకు నియమించినది. కాంగ్రెసు కమిటీ ఉపసంఘ సభ్యులమైన మేము ఎంక్వైరీ చేయగా పైసంగతులు ధ్రువమని తేలినది. తరువాత ది 26-6-39 ని దొడ్డిపల్లలో వాయిదా అని తెలిసి, మేము, నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు, అచ్చటకు వెళ్ళితిమి. ఆనాడుకూడ సుమారు 400 మంది రైతులు హాజరైరి. తహశ్శీలుదారుగారు విచారణ 12 గంటలకు ప్రారంభించెను. ఆనాడు 12 గురిని మాత్రమే విచారించి మిగిలిన వారందరు నాకు చెప్పనక్కరలేదు వెళ్లిపొమ్మని చెప్పినారు. విచారణ ఏవిధముగ జరిగినదని మేమడుగగా చాలా పాక్షికముగా కనబడుచున్నదనియు, మునసబు రైతులను బెదరించి ప్రశ్నించుచున్నను తహశ్శీలుదారు మాట్లాడుటలేదనియు, రైతుల సాక్ష్యములు చదివి వివిరించకుండానే సంతకము చేయించెననియు, విచారణ మిక్కిలి అసంతృప్తిగా నున్నదనియు చెప్పిరి. అందుపై మాతో వచ్చిన కాంగ్రెసు అధ్యక్షులు తనకు విచారణ సమయములో దగ్గరనుండుటకు అనుజ్ఞ ఇవ్వమని కోరుచు సదరు అధికారికి దరఖాస్తుపెట్టగ, దరఖాస్తు నిరాకరించబడెను. రైతులు విచారణ సరిగాలేదని తిరిగి సబుకలెక్టరుగార్కి 27-6-39 తేదీని పిటీషను పెట్టిరి. 18-7-39 తేదీని పునర్విచారణ ప్రారంభమై ఒక్కసాక్షి మాత్రము పూర్తి అయ్యెను. ఇది ఇట్లుండ మునసబుగారు ఆ గ్రామప్రజలను సాక్ష్యము లిచ్చినందుకె అనేకవిధముల హింసించుచున్నట్లు ఏరోజుకారోజు మాకు వార్తలు వచ్చుచున్నవి. పాపం రైతులు ఎట్లో ఈనాల్గు రోజులు కళ్ళుమూసుకుని ఈకష్టాలు, దౌర్జన్యాలు సహిస్తే విచారణానంతరము కలిగే ఫలితమువల్ల, లంచగొండి, దుర్మార్గుడుఅయిన మునసబుగారి బాధ శాశ్వతంగా వదులుతుంది కదా అని సంతృప్తి చెందుచున్నారు.

* * *

### ఆత్మకూరు తాలూకా రైతు సోదరులకు

#### జి. సి. కొండయ్యగారి విజ్ఞప్తి.

సోదరులారా! పోయిన సంవత్సరం మన తాలూకాలో సుమారు 20 గ్రామాల్లో రైతు సంఘాల నెలకొల్పాము. 600 మంది రైతు మెంబర్లను చేర్పించాము. కాని యింతకన్న యెక్కువగ్రామాల్లో రైతుసంఘాల నెలకొల్పటంగాని యెక్కువమంది రైతు మెంబర్లను చేర్పించటంగాని జరగకుండా పోయింది. వున్న రైతు సంఘాలైనా ఆయా గ్రామాలల్లోవున్న రైతుల దినదిన కష్టాలేమిటో తెలుసుకొని ఆకష్టాలను అరికట్టే మార్గాలు వెతుకలేకపోయాయి. వానిలి చెప్పుక్రింద రైతుల ఆపరాధపు పన్నులకు వ్యతిరేకంగాచేసిన ఆందోళన, ఆపన్ను తోసివేయించుకోవటం, తప్పితే యితరత్రా యింకేమీపని జరుగలేదు ఇక మన తాలూకాలోవున్న నీటి యిబ్బందులు; యుదేశాలంగా యేదో ఒకమూల ప్రతియేటా కరువు; వైద్య సౌకర్యాలు లేకపోవటం; కొప్పొగొప్పే పున్నా, లంచాలబాధ; విద్యాసౌకర్యాలు లేకపోవటం; చాలగ్రామాల్లో మంచినీళ్ల వసతులు లేకపోవటం; రివిన్యూ ఆఫీసర్ల లంచాలు; పోలీసుల దొంగకేసులు లంచాలు, షాహుకార్ల వడ్డీలబాధ; దొంగ ప్రోనోట్లు; గ్రామాధికార్ల నిరంకుశత్వం, ఫారెస్టు కిస్తీలు; పైలెండిపోయినా, అసలు పన్నులేగిక ఆపరాధపుపన్నులూ; రిజిస్ట్రాఫీసు లంచాలు, మొదలుగాగల కష్టాలతో రోజురోజుకూ రైతులు, కూలీలు క్రుంగి క్రుశించటం అందరెరిగినదే. యిట్లాంటి పరిస్థితులు ప్రత్యేకంగా మనకేగాక భారతదేశములోనున్న రైతు కూలీలందరికీ వున్నవి. అయితే ప్రస్తుత భారతదేశ పరిస్థితులు కనుగొన్నట్లయితే, యేమూల చూచిన్నా రైతు కూలీలలో వారి దైనందిన కష్టాలు పోగొట్టుకొన ఉత్సాహము, పట్టుదల, యేర్పడమేగాక యీ కష్టాలు పోగొట్టుకొనుటకై యెన్నో పోరాటాలు సల్పుచున్నారు. విజయవంతులౌచున్నారు. అంతేగాదు. పైపేర్కొన్న రోజురోజు యిబ్బందులకొరకేకాదు భారతదేశ రైతులపోరాటం, మనకిన్ని కష్టాలకు కారణమై మనలను బానిసలచేసి, మన రక్తమాంసముల హరించి, ఆహర్నిశలూ మనపై పెత్తనం చెలాయిస్తూ, మనలను దోపిడీచేసి మన భాగ్యభోగ్యముల కొల్లగొట్టి, తుదకు నిర్జీవులుగా చేసినపైచే యింగ్లీషు ప్రభుత్వాన్ని నిర్మూలనచేసి కష్టజీవుల కల్పతరువగు రైతు-కూలీ రాజ్యము స్థాపించుటకు స్వాతంత్ర పోరాటంలో ఆహుతి అగుటకుకూడా వెనుదీయని స్వాతంత్ర పిపాసను రేకెత్తించే రోజులివి అయినా మన మెంతో వెనుకపడిపోయాం. మనకున్న కష్టాలేమిటోకూడా తెలుసుకోలేని స్థితిలోఉన్నాము. మనంకూడా మన దైనందిన కష్టాల నెదుర్కొని రాబోవు స్వాతంత్ర పోరాటంలో భాగస్వాములంకావాలంటే, గ్రామగ్రామానా రైతు సంఘాలేర్పడాలి, రైతుల కష్టాలేమిటో తెలుసుకొని, మన అభ్యర్థులైన కాంగ్రెసు మంత్రుల కెరిగింపుతూ సరిఅయిన ఆందోళన చేయాలంటే, తాలూకా సంఘం అవసరం. అందుకనే, మన తాలూకా రైతుసంఘాన్ని యెన్నుకొనుటకు ఒక కాన్ఫరెన్సు (మహాసభ) జరిపి, సంఘాన్ని నెలకొల్పి. మన తాలూకాలో పని సాగించ దలచుకొన్నాము. కాబట్టి మన తాలూకాలో ప్రతిగ్రామమున్నుంచి యిద్దరికి తక్కువకాకుండా అభ్యర్థులనుపంపించాలి (డెలిగేట్లను) రైతు మహాసభ యీనెల (ఆగస్టు 30వ తేది) జరుపదలచుకొన్నాము మహాసభకు అధ్యక్షులుగా కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారిని ఆహ్వానించాము. ప్రారంభకులు శ్రీ కాట్రగడ్డ నారాయణరావుగారిని పిల్వదలచుకొన్నాము. కావున అభ్యర్థులుగా రాగోరువారు దరఖాస్తులు యీక్రింది అడ్రసుకు పంపకోరుతాను. మహాసభ జరుపు స్థలం ముందు ప్రకటిస్తాము.

జి. సి. కొండయ్య, ఆత్మకూరు తాలూకా రైతుసంఘ ఆర్గనైజరు, వాసిలిపోస్టు, కూరు తాలూకా, నెల్లూరు జిల్లా.

* * *

### గ్రామాల్లో మునసబుల నిరంకుశత్వం

ఆర్. ఎం. రత్నంగారిట్లు వ్రాయుచున్నారు:

8 వతేది ఉదయం కుప్పంనుండి ఎన్. నారాయణ (జిల్లా కాం. సో॥పార్టీ కార్యదర్శి) డి.రామబ్రహ్మం. కుప్పం తా॥ కాం॥ సో॥ పార్టీ కార్యదర్శి)వి.మునుస్వామి (తా॥ కాం.సో॥ కార్యదర్శి) నాగప్ప (పార్టీమెంబరు) ఒక ప్రచారక దళముగా పశ్చిమ ప్రాంతపు గ్రామాలకున్నూ; ఎల్. సుందరరాజయ్యంగారు, ఎన్. పద్మనాభరావు (జిల్లా కాం. సో. పార్టీసంయుక్త కార్యదర్శి) ఆర్. యం. రత్నంగారలు ఒక దళంగాను, బయలుదేరిరి, రెండవదళంశివరాంపురం 10 గం॥కు చేరుకొనెను. స్కూలులోచేరి పబ్లిక్ మీటింగుజరుగుతుంది అనిచెప్పపంపిరిమి గ్రామములో ఆడ్డేమంది లేరు. ఉన్నవారు కొద్దిమంది మమ్ముల చూడగనే "బిడ్డ పుట్టితే 5-0-0 లు, చస్తే 2-0-0 లు భార్య ప్రక్కన పండుకొంటేకూడా తీరువ లేస్తారంటేనే కాంగ్రెసువాళ్లు అందుకనేనా మేము ఓట్లు యిచ్చింది? ఇప్పటికే పొగాకు పన్నులువేసిరి; చెఱుకు పంటకూడా వేయకూడదని దండోరా వేసిరి" అని మావద్ద మూగారు. మేము "ఎవరుచెప్పారు" అని అడిగాము. మునసబుగారు దండోరా వేయించారు అని రైతులు చెప్పినారు. మీటింగు జరుపుతామని చెప్పిపోలమునకు వెళ్లినరైతులకై కనిపెట్టుకొని యుంటిమి.కాని రాలేదు ఆఖరకు విచారించగా తేలిన విషయము:

ఆ గ్రామము మొత్తం యిండ్లు 2 వందలు ఇందులో హరిజనులు 50 యిండ్లు. వీళ్ల వ్యవసాయ కూలీలు. తతిమ 150 మందిలో 50 మంది సవర్ణ వ్యవసాయకూలీలు. 80 మంది అర, కాలు ఎకరము చొప్పున కలిగి, దానివల్లి వచ్చు ఆదాయము చాలక కూలికి పోవునారు.కూలీలందరు ఆదివిలో ఆకులు, పప్పు ఇతరములు తెచ్చి కుప్పం మొదలగు టవున్‌లలో అమ్ముకొని బ్రతుకుతున్నారు. గ్రామములో 10 లేక 9 మంది కన్న ఎక్కువలేరు పెద్ద రైతులు. వీరిలో నిరంకుశత్వంతో కూడిన భూస్వామి గ్రామమునసబు. కూలీలందరిని నిర్బంధంగా వెట్టిచాకిరి చేయించుకొంటారు. తిండికూడా పెట్టడట. ఇటువంటి వెట్టిచాకిర్లు 3 మంది ధనికులకు తప్పనిసరిగ చేయవలెనట. ఆవేళ మేము వెళ్లిన రోజున మామీటింగుకు కూలీలు, రైతులు వచ్చి వినకూడదన్న తలంపుతో మడకలు కట్టించి (వెట్టిచాకిరి) తీసుకొనిపోయినారు. మేము ఉన్నంతవరకు సుమారు 2 గం॥ వరకు వాళ్లను వదలలేదు. మేము వేరే ఊరికి వెళ్లి మీటింగు జరుపుకొని రాత్రి వస్తే యీవిధంగా చెప్పారు:

"ఈరోజు మేము చేసింది వెట్టిచాకిరీ పొద్దున నుండి 2 గం॥ వరకు తిండికూడా పెట్టకుండా పంపారు రెడ్డిగారు" ఎవరురెడ్డి. అంటే కూలీల రక్తం గుంజుతున్న ధనిక భూస్వామి గ్రామమునసబు. వీళ్ల అన్యాయాలకు అంతులేదు కాబోలు!

## మాయలోకం

రచయిత :

శ్రీ షుద్దా విశ్వనాథంగారు

ప్రచురణ : ది సౌత్ ఇండియన్ పబ్లిషర్సు లిమిటెడ్, మద్రాసు.

150 పుటలు. వెల 6 అణులు.

★

ఇది 9 కథల సంపుటి. "ఇది అసలూ : అది నకలూ"; "అసలు కీలకం"; "స్థలాభోగం : శిలా భోగం"—ఈ మూడు కథలలో హిందూదేశపు సామాజిక సమస్యలు కొన్ని చిత్రించబడ్డాయి. "ఇది అసలూ: అది నకలూ"లో నేటివ్ ప్రభుత్వోద్యోగులు ఏ విధంగా యూరపియన్ అఫీసర్లకు వెరచి అమాయక ప్రజల్ని హింసిస్తారో చదివితే, విదేశ పరిపాలనా విధానంమీద అసంతృప్తి కలుగుతుంది. "అసలు కీలకం"లో వర్తక వ్యాపారస్థులు, వారి క్రింది తాబేదార్లు, యే విధంగా తమ స్నేహితుల్ని సహితం మోసం చేస్తారో చిత్రించబడింది. "స్థలాభోగం : శిలా భోగం"—యిది 18 వ శతాబ్దంలో జరిగిన చారిత్రక గాథ అని రచయిత వ్రాశాడు. రహమత్‌ఖాన్ అనే రాజుయొక్క దుష్పరిపాలనకు ప్రతిఫలంగా సుప్పూరు నగరం నిర్జనమైన మహా మైదానంగా తయారయిందని ఆయన నమ్మకం. కాని, చరిత్రలో పాప పుణ్యాలకు స్థానం యెక్కడనుంచి వస్తుంది? రహమత్‌ఖాన్ చేసిన దుర్నీతులు చారిత్రకములే కావచ్చు; కాని సుప్పూరు నగరం నామ రూపాలులేని సహారా యెడారిగా మారిపోవడానికి కారణం నైసర్గిక మార్పులేవో అయి వుండాలి.

"అతడి సంగతి సందర్భాలు" అనే కథలో భావం యేదో తెలుసుకోవడం కష్టం. డిటెక్టివ్‌కథగా ప్రారంభమై, అలాగే ముందుకి సాగి, చటుక్కున తెగి ఊరుకుంది. "నేరంలేని శిక్ష" ఆంధ్రరాష్ట్ర ప్రచారానికి ఉద్దేశించి వ్రాయబడింది. మదరాసు నగరమందలి చిన్న యిళ్లలో కాపురముండే ఆంధ్రులు ఇంటి యజమానుల వల్లపడే బాధలు యీకథలో చిత్రించబడ్డాయి.

మొత్తంమీద కథలన్నీ 'కులాసా కలిగించేవిగా ఉన్నాయి. భాష సరళంగాను, మృదువుగాను నడిచింది గెటప్‌కూడా ఆకర్షవంతంగా ఉంది.

—కం. స.

★ ★ ★

## ఆడమళయాళం

(కథల సంపుటి)

రచయితలు : గోపీచంద్, కృష్ణారావు, సుబ్బారావుగార్లు

ప్రచురణ : రాడికల్ పబ్లికేషన్సు, తెనాలి.

100 పేజీలు : పావలా.

★

ఇందులో గోపీచంద్‌గారి, "మళయాళం, పుస్తకాలు అమ్మేవాడు, రాయిస్టు, ఆడమళయాళం" అను కథలూ: కృష్ణరావుగారి "కాశికాయలు, భావజీవులు" అనే కథలూ; సుబ్బారావుగారి "ప్రూఫ్‌రీడర్, నా ఆరాధ్యదైవం, దీపావళినాడు" అనే కథలు ఉన్నాయి.

కథలన్నీ కులాసాగా కాలక్షేపానికి పనికివస్తాయి. పుస్తకాలమ్మేవాడు, కాశికాయలు, నా ఆరాధ్య దైవం ఇందులో ముఖ్యమైనవి. గోపీచంద్ సంభాషణలు బాగుంటాయి. కృష్ణరావు కలలు గనదంజాస్తి. సుబ్బారావు కథలింకా ప్రారంభదశలో ఉన్నాయి. ముఖ్యంగా అతని 'ప్రూఫ్‌రీడర్' మన నాతావరణానికి సంబంధించనట్లు: మరోభాషలో చూటాడినట్లు ఉంది.

ప్రోగ్రెసివ్ సాహిత్యం కావాలనే గోపీచందుగారు, ప్రోగ్రెసివ్ సాహిత్యంకోసం భావకుల్ని ఛాలెంజ్ చేసే కృష్ణరావుగారూ, ఇంచుమించు వీరి ధోరణిగల సుబ్బారావుగారూ, ప్రోగ్రెసివ్ కథలు ఇక ముందు వ్రాస్తారని ఆశిస్తున్నా.

—టి. వి. ఆర్.

★ ★ ★

## పాంచజన్యం

(రాజకీయ కథల సంపుటి)

అనువాదకర్త, సంగ్రహకర్త : 'చక్రపాణి'

ప్రచురణ : నవశక్తి కార్యాలయం. బెజవాడ.

114 పేజీలు:—వెల ఆరణాలు.

★

బంకిమచంద్ర చటర్జీ, రవీంద్రనాథ టాకూర్, పరశురామ్, అశోక చటర్జీ, ప్రమథనాథ బిశీ, ప్రమథనాథ చౌదరీ, సజనీకాంతదాస్, రవీంద్రనాథమైత్ర, అను వంగకథకుల కథలను, సంగ్రహించి, అనువదించారు చక్రపాణిగారు.

ప్రజాబంధులో "బడదీదీ" నవశక్తిలో "దేవదాస్" "పరిణీత" లు ప్రకటించబడుతూ ఉన్నప్పుడు చాల ఆతురతతో చదివేవాణ్ని. "చక్రపాణి" భాషాంతరీకరణంగా కన్పడక అసలు స్వతంత్ర రచనగానే కన్పడేది.

ఈ కథలనుకూడ చాల ఆతురతతో చదివాను.

"పిల్లి"లో, ఆకలి బాధచే మాడుతూ ఉన్నవారికి కష్టాలు: ధనవంతులకు, తిండికి లోటులేనివారికి గౌరవాలూ; వస్తాయి. ఈపరిస్థితులనుండి బయటపడాలంటే ధనవంతులు సమాజముపై తమ లాభాలకోసం విధించిన నిబంధనల నుల్లంఘించటమే మార్గమని "పిల్లి" ఉపన్యసిస్తుంది. "తిండిదొరకని సమాజోన్నతి నాకెందుకు" అన్నది పిల్లి. దానికేకాదు, ఏమనిషికీ కూడ అవసరములేదు: అసలు అది సమాజోన్నతి కూడ కాదు!!

"సామ్యవాదము మంచిదని మేముఒప్పుకుంటాము కాని దానికి ఒక హద్దున్నది. తమకు పైనున్నవారు తమ్ము సమానంగా చూడాలి. తాము మాత్రము తమ కన్న క్రిందనున్నవారిని తమతో సమానంగాజూడరు." ఈ ధోరణిని వ్యక్తీకరిస్తూ ఉన్న ఒక చిన్న వ్యంగ్యం "కానీ కడగండ్లు"

ప్రభుత్వాలు, ఉద్యోగస్థులు, "కుట్ర" లను భయముతో ఎంత నిరాధారంగా ప్రజలపై అత్యాచారాలు, దౌర్జన్యాలు చేస్తారో "కుట్ర" వెల్లడిస్తూ ఉంది.

"దేశద్రోహి" తన సర్వస్వము దేశసేవలో ధార పోస్తాడు. తల్లికి తిండికూడ ఏర్పాటుచేయడు. కారాగారములోపడి క్షయతో బయటపడుతాడు. ఈతని త్యాగసేవలపై నాయకత్వము సంపాదించిన వ్యక్తి. ఇతనిని నిరసిస్తాడు. "దేశద్రోహి" అని అంటాడు. ప్రజలు ఈ వింత "దేశద్రోహి"ని కొట్టి చంపుతారు. ఈ చిన్నకథ ప్రస్తుతము మన దేశసేవకుల స్థితిని ఒక పర్యాయము కన్నులకు కట్టినట్లు తెలియజేస్తూ ఉంది. దేశానికి సర్వస్వము ధారపోసి పనిచేస్తూ ఉన్న వారికి, వారి కుటుంబాలక్కు, తగిన ఉపాధులు కల్పించడము, వారిని మరచిపోకుండడము ప్రజలు చేయవలసిన కనీస ధర్మమని ఇది ఎలుగెత్తి చాటుతూ ఉంది.

"మీరు-మేమూ" ప్రాచ్యదేశాలకు, పాశ్చాత్యదేశాలకు ఉన్నవనుకొనే భేదాలను తీసుకొని వ్యంగ్యముగా వ్రాయబడింది. మన దేశములోని మూఢవిశ్వాసాలను, తీవ్రంగా ఎత్తిపొడుస్తూ ఉంది. ఈ ఎత్తిపొడుపులతో పౌరుషము తెచ్చుకొని, దేశస్థితి మార్చడానికి పాఠకులు నడుము కట్టుతారనుకుంటాను.

కాని ఈ కథలన్నిటిలోను పాఠకుల్ని, భారతీయుని ఎక్కువ సంతృప్తి పరచేది "కథ అడ్డం తిరిగితే!" కాని ఈ సంతృప్తి చేతకాని వానికి మాత్రమే కలుగుతుంది. భారతీయులు ఇంగ్లండుపై రాజ్యాధికారము చేస్తున్నారనుకోండి. అప్పుడు మనము వారిని ఇంగ్లీషువారు మనకు నేడు చూపుతున్న మార్గాన వెళ్ళితే, ఇంగ్లీషువారిని ఏ విధంగా అవమానాలకు గురిచేయగలమో తెలియజేసే ఒక ఊహా చిత్రము. భారతీయులకెప్పుడూ ఇంగ్లండుపైగాని మరి యేయితర దేశముపైగాని పెత్తనముపద్దు. వారిని మనము ప్రతీకారము కోసమని, నీచముగా చూడము. కాని ఊహా చిత్రములో ప్రతి భారతీయుడు తన జీవితములో ప్రతి ఘట్టమందు ఇంగ్లీషువారు తన్ను ఏ విధంగా అవమాన పరుస్తూ ఉందీ గుర్తించి స్వాతంత్ర పిపాసి అవుతాడని వ్యంగ్యముగా వ్రాయబడింది. ప్రతి భారతీయుడు దీనిని చదువాలి. ఆత్మ గౌరవము కాపాడుకోవాలి. దానికోసం స్వాతంత్ర్యము సంపాదించుకోవాలి.

ఇలాంటి కథలు, బెంగాలీ భాషనుండి అనువదించి ఇచ్చిన "చక్రపాణి"కి ఆంధ్రులు కృతజ్ఞులు. కాని ఆంధ్రభాషలోనే ఇట్టి కథలు స్వతంత్రంగా ఎప్పటికి రచించడము?

—వు. సు.

★ ★ ★

## సినీమా పరిశ్రమ

రచయిత : కం. కృష్ణమూర్తిగారు, పిఠాపురం.

245 పేజీలు : వెల రూపాయి.

★

సినీమా చరిత్ర; సినీమా కెమేరా; శబ్దగ్రహణ యంత్రం, సినీమా దర్శినీ యంత్రం; రసాయనశాల, చిత్రశాల; చిత్ర నిర్మాణము; దిగ్దర్శకుడు; నటుడు; ఛాయాచిత్ర గ్రాహకుడు; శబ్ద గ్రాహకుడు; ప్రకటన, వ్యాసము అను 12 శీర్షికలక్రింద, సినీమాను గురించి వ్రాశారు.

తెలుగులో, సినిమా పరిశ్రమను గురించి గ్రంథాలు లేనప్పుడు, ఈ రచనకు పూనుకోవడం ప్రశంసింపదగిందే. కానీ, చిత్రశాల అనే అధ్యాయం వచ్చేవరకు ఈ పుస్తకం చదువుతోంటే, ఈనాటి పాఠశాలలలోని సైన్సు టెక్స్టుబుక్కులు జ్ఞాపకం వస్తాయి. సామాన్యముగా వాడుకలో ఉన్న డైరక్టరు, సినేరియో, లాగానే క్రొత్త ఆంగ్ల పదాలనుకూడ, వాడుతుంటే, అవే వాడుకలోకి వస్తాయి. కాని ప్రతి ఆంగ్ల పదానికీ, తెలుగు పదం వాడాలనే ఉద్దేశ్యంలో నీరు washing కు 'క్షాళన' మొదలగు పదాలు వాడారు. 'కడగడము' అంటే సరిపోతుంది. ఇలాగే చాలా.

కొంచెం ఓపికతో, ఒకటి రెండు సార్లు చదివితే, ఇదివరకు సినిమాపరిశ్రమను గురించి తెలియని తెలుగు పాఠకులకు ఉపయోగపడుతుంది.

—టి. వి. ఆర్.



# బొంబాయి కార్మిక నాయకుల అరెస్టు

17 వ తేదీ బొంబాయి సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి వారు కార్మికనాయకులయిన యస్. ఏ. డాంగే గిర్నీ కంగార్ యూనియన్ కార్యదర్శి, డాంగేసతి, యస్. యస్. మిరాజ్‌కర్ రాష్ట్ర ప్రెస్ యూనియన్ కార్యదర్శి (కార్పొరేషన్ మెంబరు), యస్. జి. పాట్కర్, ఆర్. కె. భోగ్లేగార్లను అరెస్టు చేసారు. తరువాత యస్. వి. ఘాటేకూడా అరెస్టు చేయబడెను. వీరిపై 117, 107, 141, 506 సెక్షన్లు ప్రయోగింపబడ్డాయి. దౌర్జన్యాన్ని ప్రోత్సహించారనియు, ఆటంకం కలిగించారనియు, నేరాలను ప్రోత్సహించారనియు ఆరోపించబడెను.

ముద్దాయిల తరపున కె. యఫ్. నారిమన్‌గారు జామీన్ పిటీషను పెట్టిరి, కాని మేజిస్ట్రేటుచే బెయిలు పిటీషను నిరాకరించబడెను. డాంగెసతికి మాత్రం 12 నెలల పిల్లతల్లి యగుటచే 300రూ. లకు హామీ 150 రు ధరావతు జామీనులపై, కార్మిక సభలలో ఉపన్యసింపకూడదు, కోరినపుడు పోలీసుస్టేషనుకు హాజరు కావలయునను షరతులపై జామీను యివ్వబడెను. తక్కిన ముద్దాయి లందరు రిమాండు చేయబడిరి.

బొంబాయి రాష్ట్రకాంగ్రెసు సమావేశంలో డాక్టరు అధికారి గారిచే అరెస్టులను చర్చించుటకుగాను ప్రతిపాదింపబడిన అడ్జర్న్‌మెంటు తీర్మానం భూలాభాయి దేశాయిగారిచే 'సబ్‌జుడిస్' అనిరూలౌటు చేయబడెను

## కాకినాడ

స్టీవ్‌డోర్ కూలీసంఘం

జూలై నెలలో జరిగిన పని.

కూలీల కూలి యిచ్చేటప్పుడు సాధ్యమైనంతమట్టుకు అక్కడక్కడ దగ్గరవుండి ఏమీ మినహాయింపులు లేకుండా చూస్తూ, స్టీవ్‌డోర్ కంపెనీలకు కూలీల కూలి గురించి రిపోర్టు చేయబడింది. కార్యనిర్వాహక వర్గానికి కూలీల హక్కుల గురించిన్నీ, భోజన సదుపాయాలు, విశ్రాంతి, పనికి తీసుకువెళ్ళుటను గురించి సంఘపు ఆఫీసుకు రిపోర్టు చేయవలసిందని ఏర్పాటు చేయబడింది. ప్రతి శుక్రవారం ఉదయం 9 గంటలకు స్టీవ్‌డోర్ కూలీలంతా సంఘపు ఆఫీసులో సభకు హాజరయి తమ తమ కష్టాలను తెలియజేసి అవి నివారణయ్యే మార్గాలు వెతకాలి, కష్టాలను పోగొట్టుకోవాలి.

కొంతమంది కూలీ సోదరులకు సరిగా కూలి ముట్టుట లేదని రిపోర్టులు వచ్చుటతోడనే వాళ్లకు కూలి యిప్పించబడింది. పులపకోరు స్వామి అనే కార్మికసోదరుడు స్టీమరులో తప్పిపోగా లర్వీ కంపెనీకి ఉత్తరం వ్రాసి టెలిగ్రాం యిప్పించి రప్పించబడ్డాడు. యస్. కృపానరం, ఎద్దురాములు, బోని వద్దయ్య మరి కొందరికి దెబ్బలు తగులగా వారలకు నష్టపరిహారం లేబరు కమీషనర్కు రిపోర్టు, కేసులేకుండగనే పరిష్కారం చేయబడుచున్నవి. వి. వీరన్న, యస్. నాగన్న, యం. వెంకటేశ్వర్లు మరికొందరికి కూలి మినహాయింపులు జరిగాయని రిపోర్టులు రాగానే కోరమాండల్ కంపెనీ దుబాసీ, వి. నరశింహారావుగార్కి తెలియచేయబడి, స్వయంగా కలుసుకొని విషయాలను సెటిలు చేయమని చెప్పబడింది.

పేమెంటు అఫ్ వేజెస్ ఆక్టు అమలు జరుపవలసిందని తీర్మానం పంపగా లేబరు కమీషనరు ఫ్యాక్టరీ ఇన స్పెక్టరుకు ఆజ్ఞయివ్వగా ఆయన, కూలీల కూలినుంచి ఎంతెంత పోవుచున్నది రిపోర్టు తీసికొని మెద్రాసు పంపించబడ్డది. ఇక ముందు వారు కమీషన్లుపోకుండా కంపెనీలనుంచే కూలి సరిగా యివ్వబడుటకు తగిన ఏర్పాట్లు జరుగుతాయని ఫ్యాక్టరీ యినస్పెక్టరుగారు తెలపుయిచ్చినారు, మెద్రాసునుంచి కూడా త్వరలోనే కంపెనీలకు, స్టీవ్‌దోర్ కూలీసంఘానికి ఆజ్ఞలు రావచ్చును.

ఇట్లు,

యస్. వి. రత్నం,

శక్రటరి.

## నెల్లిమర్ల

జ్యూటు మిల్లు కార్మిక సంఘం.

రాజీ షరతులు.

నెల్లిమర్ల జ్యూటు మిల్లు కార్మిక సంఘ సభ యీ నెల 10 వ తేదీ సాయంత్రము 6 గంటలకు ఏటి యిసుక మైదానములో పెమ్మరాజు వెంకట్రావుగారి అధ్యక్షతను జరిగెను. వెయ్యిమందికి పైగా కార్మికులు హాజరైరి.

వెంకట్రావుగారు ప్రస్తుత జ్యూటు కార్మికుల పరిస్థితుల గురించి మాట్లాడుచు జ్యూటు మిల్లు యజమానులు బలమయిన సంఘముక్రింద ఏర్పడి, ఎప్పటికప్పుడే కార్మికుల పద్ధతులలో తీవ్రమయిన మార్పులు తీసుకువస్తున్నారనియు, యీ మధ్యనే వారు చేసిన నిర్ణయాన్నిబట్టి హిందూదేశములో 6700 మగ్గములను విసిరివేయుటకు అందుచే సుమారు నలభైవేలమందికి పనిపోవలసిన పరిస్థితులు ఏర్పడినవనియు తెలియజేసిరి. బెంగాలు రాష్ట్రములో జరిగిన సంప్రదింపుల ఫలితంగా ఆ రాష్ట్రములో పనివారలు పనిచేసే గంటలు తగ్గించి. పనివారలను తొలగించకుండా యుండే పద్ధతికి కార్మిక సంఘములు, యజమానులు అంగీకరించిరనియు. తత్ఫలితముగా పనిచేసే గంటలు వారమునకు నలువది గంటలు చొప్పున నిర్ణయించబడెననియు, అప్పటికీ యింకా సుమారు ఎనిమిదివేల జ్యూటు కార్మికులను ఆ రాష్ట్రములో తొలగించుటకు యజమానులు సిద్ధపడిరనియు, యిందు విషయమై సంప్రదింపులు జరుగుచున్నవనియు తెలిపిరి. ఈ సందర్భములో నెల్లిమర్ల జ్యూటు మిల్లులోకూడా సుమారు రెండువందలమంది పనివారలకుకూడా పనిపోవలసిన పరిస్థితులు ఏర్పడుటచే, తాను యజమానులతో సంభాషణలు జరిపి కార్మికుల కనుకూలమైన ఒడంబడిక కుదుర్చగలిగితిననియు తెలిపిరి. ఈ ఒడంబడిక ప్రకారము.

1. మిల్లులో పనిచేయుచున్న ఏ కార్మికునిగాని పనిలోనుండి తొలగించకుండుటకు.

2. మగ్గముల డిపార్టుమెంటులో తప్ప మిగతా డిపార్టుమెంటులలో పనివారలు పనిచేయు గంటలు తగ్గించకుండుటకు, వారి జీతములు తగ్గకుండుటకు.

3. మగ్గముల డిపార్టుమెంటులో పని గంటలు వారమునకు 48 గంటలకు మార్చుటకు.

4. యీ గంటలు తగ్గింపువలన కార్మికులకు వచ్చే నష్టమును భర్తీచేయుటకు ప్రొడక్షను బోనస్సును ఎక్కువ చేయుటకు, ఉత్పత్తి ఎక్కువ వచ్చే ఏర్పాటు గావించుటకు

5. యింతవరకు పనిలోనికి తీసుకొనబడని సుమారు 30 మందిని పనిలోనికి తీసుకొనుటకు.

## కార్మిక సమస్యలు

## 28 వ తేదీ అసమ్మతి సభలు జరపండి

బొంబాయి కార్మిక నాయకులు కమ్యూనిష్టులు అగు డాంగే, మిరాజ్‌కర్ వగైరాలను అరెస్టు చేసినందులకు 28 వ తేదీ అసమ్మతి సభలు దేశమంతటా జరపాలి, కాంగ్రెసు మంత్రివర్గము వారిపై కేసులు ఉపసంహరించుకోవాలనీ, ఫోనిక్సు మిల్లు యజమానులపై ఒత్తిడి తెచ్చి 'లాకౌటు' పరిష్కారం చెయాలనీ తీర్మానాలు చేసి బొంబాయి ప్రభుత్వానికి పంపవలెను. రిపోర్టులు నేషనల్ ఫ్రంటుకు, నవశక్తికి పంపాలి.

## ఏలూరు

పట్టణ కార్మిక సంఘం

ది 15-8-39 తేదీ సంఘకార్యాలయమందు కార్మిక సంఘ వార్షిక ఎన్నికలు జరిగాయి. అధ్యక్షులుగా కె. అప్పలస్వామి (మున్సిపల్ కౌన్సిలర్) గారును, ఉపాధ్యక్షులుగా 8 అప్పలస్వామిగారును, ప్రధాన కార్యదర్శిగా దం. మాణిక్యాలరావు, సంయుక్త కార్యదర్శిగా బ. సూర్యనారాయణగార్లు ఎన్నుకోబడ్డారు.

సుభాస్ చంద్రబోసుపై డిసిప్లినరీచర్య నిరశింపుతూ రాజకీయ ఖైదీల విడుదలపై వర్కింగు కమిటీ తీర్మానంలోని చివరిపేరాను ఉపసంహరించుకోవాలనీ తీర్మానించబడెను. బోసు ఎలూరు వచ్చినప్పుడు అఖండ స్వాగత మివ్వాలని తీర్మానించబడెను. మునగాల ఖైదీలను వెంటనే విడుదల చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించబడెను.

## యం. యస్. యం. రైల్వే యూనియన్

బ్రాంచి - రాజమండ్రి.

పై యూనియన్ ఆఫీసువద్ద 10-8-39తేదీ కామ్రేడ్ యం. శ్రీరామపాత్రుడుగారి అధ్యక్షతను బదలీ చేయబడిన కామ్రేడ్ దాసరి గంగరాజుగార్కి వీడ్కోలా సంగుటకు బహిరంగ సభ జరుపబడెను. గంగరాజుగారు యూనియన్‌కు చేసిన సేవకొని యాడబడెను. వారిపై కొండెములు అధికారులకు వ్రాసిన జి. కన్నయ్యగారి చర్యలు నిరశింపబడెను. బొంబాయిలో రైల్వే బోర్డులో రైల్వేకార్మిక ఫెడరేషను వారి సంప్రదింపుల ఫలితాలు సభలో వివరించబడెను. కష్టాల శీతగాంధ్రకు ప్రావిడెంటు ఫండు ఏర్పాటుచేయుటకు బోర్డు అంగీకరించక పోవుట ఖండించబడెను

## ఖుదీరాంబోసు

(2 వ పేజీ తరువాయి)

భర తిలకు తనకేసరిపత్రికలో ప్రధాన వ్యాసము వ్రాసినాడు. దుర్మార్గులగు అధికారులనా విధంగా హతమార్చిన ఎడల వారిఅత్యాచారాలు అంతమొందవనీ, ప్రజా భీష్టమును క్రియారూపమున బెట్టు ఖుదీరాంనంటి యువకులనుప్రభుత్వం శిక్షించుట ద్వారా హత్యలు ఆగిపోవనీ, అధికారులుచేసే అన్యాయ అత్యాచారములు జరుగకుండా కట్టుదిట్టములు చేస్తే యువకులు హత్యలు చేయవలసిన అవసరమే వుండదనీ తన అభిప్రాయములను నిర్భయంగా ప్రకటించినాడు.

అయితే ప్రజావిశ్వాసంతో కాక కేవలం పశుబలంతోనే పరిపాలనకు పూనుకున్న సామ్రాజ్యప్రభుత్వం తిలకు అభిప్రాయలను విని వూరుకుంటుందా? ఆయనకు కూడా వర్తించింది ఆరు సంవత్సరాల కారాగారశిక్ష.

ఖుదీరాంబోసు జైలులో నిర్విచారంగా కాలం గాడిపాడు. మృత్యువు సమీపించుచున్నదన్న చింత ఆవంతయు లేదు. నిత్యసంతోషి. జైల్లో కూడా అతను ఏవో తమాషా చేసి ఆనందించుచుండేవాడు. ఉరి తీయబడే క్రితం రోజున జైలుసూపర్నెంటు అతనికొక మామిడిపండునిచ్చాడు. ఖుదీరాం ఆ పండును బాగా నలిపి ముచికవద్ద చిన్న రంధ్రంచేసి అందలి రసముంతా పీల్చివైచాడు. రంధ్రంగుండా నోటితో వూది గాలికి వుబ్బిన తొల్ల మామిడిపండును ద్వారముున తెరుపుగుండా అందరికీ కన్పడులాగున పెట్టాడు. మామూలు పండులాగనే కన్పడుతోంది. తరువాత డాక్టరువచ్చి మామిడిపండు చూచి "ఏం మామిడిపండు తినకుండా ఇంకా అలాగే వుంచివేశా" వని అడిగాడు. ఖుదీరాం నేను ఇందాకనే తిన్నానండీ. తోలు చూచి తినలేదనుకుంటున్నారు. అది పట్టుకు చూడండి" అన్నాడు. మరునాడే వురితీయబడతాడు గాన విచారంతో మామిడిపండు తినక స్మృతిలేని మాటలు మాట్లాడుతున్నాడని డాక్టరనుకున్నాడు. మామిడిపండు తొల్లనుతీని పత్తినాడు. ఏముంది ఒట్టి తొల్ల. ఖుదీరాం పకపక నవ్వుతున్నాడు. రేపు వురితీయబోతున్నా కొంటెపనులు చేస్తూ నవ్వుతూ సంతోషిస్తున్నాడే! ఎలాంటి మనిషన్నా!" అని ఆశ్చర్యపడ్డాడు డాక్టరు

ఆగష్టు 11 వ తేదీ వచ్చింది. పెందలకడనే ఖుదీరాం లేచి కాలకృత్యములు తీర్చుకొని భగవద్గీతా పారాయణ చేశాడు. యథా సమయానకి బలిపీఠమెక్కాడు. అనంతరం.... ఏముంది! అతని ఆత్మ అనంతాకాశంలో కలిసిపోయింది.

ఖుదీరాంబోసు శవమునకు దహన సంస్కారమొనర్చుటకు కాళిదాసబోసు ముందే అనుజ్ఞ పొందినాడు. జైలు అధికారులు శవాన్ని అతనికి అప్పగించారు. శవంతో స్మశానవాటికకు వేల కొలది ప్రజలు వెళ్లారు. కొందరు తలవాల్చినారు. మరికొందరు కన్నీళ్ల తుడుచుకుంటున్నారు. కొందరికి మాట రావడం లేదు. కొందరు వెక్కివెక్కిపడుతున్నారు. ఆసర్వజన శోకదృశ్యాన్ని వర్ణించడం సాధ్యం కాదు.

శవ దహనానికి అనేకమంది చందనపు చెక్కలను చితిలో వేశారు. చూస్తూ చూస్తూ వుండగనే ఆ వీర యువకుని పవిత్ర శరీరము అనలుని తీవ్రప్రకోపములో భస్మమయి పోయినది.

భక్తితో చేరినజనులు ఖుదీరాం బూడిదకొరకు త్రోసుకుని త్రొక్కిసలాడిరి. తలా కొంచెం భస్మాన్ని గుప్పిట బట్టిరి. అందరూ ఆ భస్మమును ముఖాన బొట్టుపెట్టుకున్నారు. ఒంటికి పూసుకున్నారు. మిగిలినవాన్ని బహుభద్రంగా తీసుకుపోయి దాచుకున్నారు.

ఈ విధంగా ఖుదీరాం అంతర్థానమైనా అతని భావాలు ప్రజాహృదయములో బలమైన స్థానం లభించింది.

## సంస్థానాలు

(12 వ పేజీ తరువాయి)

తుపాకిగుండ్లు బహుమానం. కొందరు చచ్చారు. చాలామంది గాయపడ్డారు. అనేకులు భయపడి పారిపోయారు. వారి నాయకుని అరెస్టుచేసి విచారణచేశారు. అతన్ని ఎవరూ చూడటానికి వీల్లేదు ఏ 'లాయరూ' అక్కడికి పోవడానికి వీల్లేదు. ఇదంతా నిష్టానుంచి చూచితే, సంస్థానంలో ఈ అన్యాయం జరగకుండా అడునప్పు.

ఒక 'నాన్ అఫీషియల్ ఇంక్వైరీ' కమిటీ ఏర్పడింది. కాని ఇంతేగాదు జుడిషియల్ కమిటీ విచారణకావాలి. ఈ విచారణను అంగీకరించకపోతే, బ్రిటిషువారియొక్క, సంస్థాన ప్రభువు యొక్క నిరంకుశత్వం తెలుస్తుంది ధామీ నిష్టా ప్రభుత్వాల రెంటింటినీ మేము ఖండించి తీరుతాం.

ప్రజలకు హెచ్చరిక. మొదట 'బేగార్' (వెట్టి) పోవాలనీ, నిర్బంధ వెట్టి పోవాలనీ. అక్రమవసూళ్లు పోవాలనీ ఆందోళన వెంటనే చేయాలి. తర్వాత, లాంచ్ రెవిన్యూ గురించి. పౌరస్వాతంత్ర్యహక్కుల గురించి అడగాలి. ఈ చిన్న సంస్థానా లిలా ఉన్నంతవరకు మోక్షం లేదు. చిన్నవైనా, పెద్దవైనా మొదట పై కోర్టుల గోయతూ.లాంచ్ రెవిన్యూ తగ్గించాలనీ నిరంకుశత్వం పోవాలనీ ఆందోళన చేయాలి.

ఈ చిన్న సంస్థానాధీశు లందరూ కీలుబొమ్మలు ఈ పర్వత సంస్థానాల్లోను, నిష్టాలోను ఏలేది బ్రిటిషు రాజ్యం. నిరంకుశత్వానికీ. ఈ అన్యాయపు పరిపాలనకు బాధ్యత బ్రిటిషు ప్రభుత్వమే."

## అనధికార విచారణ కమిటీ రిపోర్టు

ఈ కమిటీకి. లాలాధని చంద్, యం. యల్. ఏ. (పంజాబు) ప్రెసిడెంటు. రిపోర్టులో ప్రజామండలిని కూడా విమర్శించారు. కొద్ది కాలంలోనే బాధ్యతాయుత ప్రభుత్వం అడగడంతప్పనీ వాగమత్ నిషేధం ఉల్లంఘించడం తప్పనీ అన్నారు. ప్రజల కష్టాలనుగూర్చి ఇలాచెప్పారు

ప్రజల కష్టాలు.

"నిర్బంధపు వెట్టిఉంది. ప్రజల భూములన్నీ అడవులుగా మార్చారు. మనుష్యులనుగాని, పంటలనుగాని అడవి జంతువులనుండి రక్షణలేదు. న్యాయపరిపాలన శాఖగాని, పరిపాలనా శాఖగాని లేదు.

50 నుండి 100 రూపాయలదాకా ఆత్మ రక్షణకై ఏనుగుల్ని చిరతపులుల్ని చంపినా, జరిమానా వేస్తారు. ఒకసారి అడవిమృగాల నుండి తమను రక్షించమని అడగడానికి వెళ్లితే 5 గురిని అరెస్టుచేసి 3 నెలలు లాకప్‌లోపెట్టి. తర్వాత కఠినశిక్ష 100 రూ. జరిమానావేశారు.

సంస్థానాధీశుని ఇంట్లో చచ్చినా, పెండ్లయినా, రూపాయి మొదలుకొని 50 రూపాయల దాకా ఈయాలి. కోటలో ఎవడున్నా సరే. ఆడవాళ్లు తమ నగలన్నీ పెట్టుకోడం మానేయాలి. మగవాళ్లు మీసాలు, తలలూ గొరిగించుకోవాలి. "శ్రాద్ధ" సమయంలో ప్రతి కుటుంబం పాలు ఉచితంగా సప్లయిచేయాలి."

## ప్రభుత్వ విచారణ కమిటీ

ఆగష్టు 9 వ తేదీన, సంస్థాన ప్రభుత్వం ఒకకమిటీని విచారణకై ఏర్పరిచామని ప్రకటించింది. ఒకఅధ్యక్షుడూ, 6 గురు సభ్యులూ (ఇందులో 3 సంస్థానం తరఫునా. 3 గురు పలుకుబడిగల సంస్థాన ప్రజలూ) ఉంటారు. పారిపోయిన ప్రజలను కష్టపెట్టమనీ, తిరిగి రమ్మనీ ప్రకటించింది.

కాని జవహర్ కోరినట్లు, అనధికార విచారణకమిటీ కోరినట్లుకూడా, జ్యుడిషియల్ విచారణను మైతం ఏర్పరచలేదు!

## మునగాల రైతులపై కొత్త కేసులు

కామ్రేడ్ వి. ఆంజనేయులుగారు యీ విధంగా వ్రాయుచున్నారు:—

రామాపురం గ్రామస్థులు జమీందారుకు లొంగలేదని అనేక రకాల కేసులను ప్రజలపై పెట్టించి యీ కరువు రోజుల్లో కోర్టుల పాలు జేసి నానా భీభత్సం చేస్తున్నారు జమీందారు. ఇప్పటికే మూడు కేసులున్నవి. ఒక కేసులో 7 గురు, రెండవ దానిలో 14 గురు, మూడవ దానిలో 21 మంది. ఇంకా యిప్పుడు "ఎస్టేటు మనుష్యుల కొట్లపోయినవనీ, మేకలు పోయినవనీ, రైతులు దొంగతనం చేస్తున్నారనీ" కేసులు. మొన్నటి రోజున కొత్వాలు మేక పోయిందట. ఆ రోజుననే జమీందారుగారి రామాపురపు ఏజంటు బుచ్చయ్యగారి కోళ్లు పోయినవట. ఈ పని రైతులు చేయించారని రిపోర్టు. వారి యిండ్లు పోలీసులచే సోదా చేయబడినవి. కాని ఏమీ దొరకలేదు.

యింకా ఆకు పాములు, తాడువాయి, రామచంద్రపురం, శిరపురం మొదలగు గ్రామాలలో 100 మందికి పైగా సుమారు 6 నెలల నుండి కోర్టులచుట్టూ తిరుగుతున్నారు. ఇక్కడకు జగ్గయ్యపేట 24 మైళ్లు నందిగామ 40 మైళ్లు ఇంతదూరం కాలి నడకను పోయిరావటంవల్ల వ్యవసాయపు పనులు చేసుకోలేపోతున్నారు. ఇంకా ఏ కేసు విషయమూ ఏమీ తేలలేదు

దొంగతనాలు చేస్తున్నారనే అనుమానంతో లోగడ ఎప్పుడూ నేరము చేయని వారినిగూడా సి. టి. యాక్టుక్రింద చేర్చి ప్రతిరోజూ రాత్రి మున్సబుగారి యింటివద్దనో, స్టేషనులోనో పండుకోవలసినదిగా ఆర్డర్లు యివ్వబడినవి. ఇప్పటికి నెలరోజులనుండి యీ విధముగా అవస్థ పెడుతున్నారు.

కాంగ్రెసు మంత్రివర్గమువారు సి.టీ యాక్టును రద్దుపరచుటకు తీవ్రప్రయత్నములు చేయాలి. ఈలోగా అష్ట అమలు జరుగకుండునటుల జి. ఓ. ప్యాస్‌చేయించవలెను.

గవర్నమెంటుచే నియమింపబడిన పరిష్కర్తగారు నిర్ణయములు యివ్వకముందే జప్తు అస్తులకు వేలం నోటీసులు 20-8-39 తేదీని జారీచేయబడినవి.

* * *

మునగాల ఎస్టేటు రైతుసంఘపు ప్రతినిధులు 18-8-39 న మునగాల రైతుసంఘ ఆఫీసులో కొల్లు కోటయ్యగారి అధ్యక్షతను సమావేశమై యీ దిగువ తీర్మానములను గావించిరి.

1 మునగాల సత్యాగ్రహుల విషయమై కాంగ్రెసు మంత్రివర్గమువారు చేసిన వాగ్దానము ప్రకారము యింతవరకు సత్యాగ్రహ ఖైదీల విడుదల జరుగలేదు. ప్రభుత్వపు యీచర్య కడుశోచనీయమైనది. వెంటనే ఖైదీలను విడుదల చేయించి తమ ధర్మమును నెరవేర్చ కొందురని యీ సభవారు ఆశించుచున్నారు.

2. శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యంగారి సలహా ప్రకారం యివ్వతగినవనుకున్న శిస్తులన్నియూ యివ్వగలవారు తప్పక 31-8-39 తేదీలోగా చెల్లించుటకు ఈసభవారు తీర్మానించుచున్నారు.

3. ప్రస్తుత మునగాల పరగణా జమీందారుల ప్రతులను ప్రభుత్వము గుర్తించి "ఎస్టేటును జమీ ప్రదేశముగా నిర్ణయించి" తగు విధముల సహాయమొనర్చవలసినదిగా కోరుచున్నారు.


# నవశక్తి


## జులై

రెండు వారములలో చేర్చిన

| | సం. చం. | స్త్రీ సం. | విరాళాలు |
|---|---|---|---|
| విశాఖపట్టణం | 0 | 1 | 0 |
| తూర్పుగోదావరి | 1 | 0 | 0 |
| పశ్చిమ గోదావరి | 11 | 4 | 27-0-0 |
| కృష్ణా | 16 | 10 | 0 |
| గుంటూరు | 16 | 9 | 2 |
| నెల్లూరు | 24 | 1 | 6-0-0 |
| ఇతరస్థలాలు | 4 | 1 | 0 |
| | 72 | 26 | 35-0-0 |





# సోవియట్ రష్యా - జర్మనీల సంధి?

గత 15 దినాలలోనూ ప్రపంచ పరిస్థితులు విషమించుతూనేపోయాయి. రూజ్‌వెల్టు చెప్పినట్లు, గత ఒకటి రెండు మాసాలకంటె ప్రపంచ పరిస్థితులు ఈ పక్షం రోజుల్లో మరీ అధ్వాన్నంగా ఉన్నాయి. "యుద్ధభీతి" ఎక్కువైంది. ఏ దేశంలో చూచినా 'మెనోవర్'లూ, సైనిక సన్నాహాలూ కన్పించుచున్నాయి,అన్నిటికన్నా యూరప్‌లో డాంజిగ్, ప్రాచ్యదేశాలలో టీన్ట్సిన్ సమస్యలు ప్రజల మనస్సులను కల్లోల పరచుతున్నాయి.

## మరొక లొంగుబాటు

ఏనాడు బ్రిటన్. "జపానువారి కష్టాలను మనం గమనించాలి" అని అన్నదో ఆనాడే ప్రపంచానికి బ్రిటన్ గుట్టు బయటపడింది, టీన్ట్సిన్ తగాదాకు మూల కారణంగా చూపబడ్డ జపాను శత్రువులగు నలుగురు చైనీయులను బ్రిటన్ అప్పగించ నిశ్చయించింది. పార్లమెంటు ముగించే దినాలలో, ఛాంబర్లేను చెప్పిన వాక్యాలలోనే ఈ ద్రోహానికి తలపడతాడనే వాసన తగిలింది. 9 వ తేదీ పత్రికలో మేం ఇలా వ్రాశాం. "ఛాంబర్లేను ప్రకటన ననుసరించి. ఇదివరకు హత్యచేశారన్న వంకతో అరెస్టు చేయబడ్డ చైనావారిని బ్రిటను జపానుకు అప్పగించుతుంది. కమ్యూనిస్టులను, ఇతర చైనావారిని, కన్సెషన్ ప్రదేశాలలో వారిని అప్పగించుతుంది." ఈ వాక్యాలు అక్షరాలా జరిగితీరాయి.

ఈ నెల 11 వ తేదీన స్థానిక కోర్టుకు ఈ నలుగురు చైనా 'హంతకు'లను బ్రిటను అప్పగించింది. సెప్టెంబరు నుండి నిర్బంధంలోవున్న మరొకనినికూడా అప్పగించింది. ఈ 'వింత హంతకులు' ఎవరు? వాని పూర్వచరిత్రకూడా గమనించుదాం.

గత ఏప్రిల్ మాసంలో, యస్. సి. చంగ్ అను నాతని బ్రిటిష్ కన్సెషన్ ప్రదేశంలోని ఒక సినిమా హాలులో కాల్చి చంపారు. ఇతడు ఫెడరల్ రిజర్వుబ్యాంకు మేనేజరు. జపాను ఇతన్ని "కస్టమ్సు సూపరింటెండెంటు"గా కూడ చేసింది. ఈ దేశద్రోహిని చంపినందుకు, జపాను పోలీసులు నలుగురు చైనావారిని అరెస్టు చేసారు. కాని సాక్ష్యం ఏమీ దొరకనందువల్ల విడిచిపెట్టింది. కాని మే నెలలో 'కులాంగ్సు' దీవులను జపాను ఆక్రమించుకొన ప్రయత్నించినపుడు, ఫ్రాంసు, బ్రిటను, అమెరికాలు అడ్డగించాయి. ఆ నాటి నుండి మళ్లా జపాను ఈ 'హంతకుల' సమస్యను ఆధారం చేసుకొని టీన్ట్సిన్ గందరగోళం ప్రారంభించింది. ఒక పారిస్‌పత్రిక వ్రాసినట్లు "బహుశా ఛాంబర్లేను. చైనా మహాజన సముద్రంలో ఈ నాలుగు బిందువులు పోతేమాత్రం ఏమి!" అని తలచాడేమో. వీరిని చిత్రవధ గావించుతారనీ, మృత్యువే వీరికి శరణ్యమనీ, వేరే చెప్పనక్కరలేదు.

వీరిలో ఇద్దరిని హత్యచేసారని. వీరి ఇద్దరిని 'అక్రమ సంఘ'సభ్యులనీ.నేరారోపణ.చేశారు సి. సి. వాంగ్ అను చైనీయుడు మాంచెస్టర్ గార్డియన్ పత్రికలో వ్రాసినట్లు 'వీరు బాధలు పొందితే, అది నేరంచేసినందుకుకాదు. మూడో పక్షం (బ్రిటన్) వారి సౌకర్యం కోసమే' అని చరిత్ర వ్రాస్తుంది."

ఇది అన్యాయమనీ, న్యాయమగు చైనా ప్రభుత్వానికి సైతం 'కన్సెషన్' ప్రదేశాలలో జోక్యం కలుగజేసికొనే అధికారం ఇంతవరకు ఈయలేదనీ, అనేకమంది అసమ్మతి చూపారు, 'హేబియస్ కార్పస్' అప్పీలుకూడా నిరాకరించబడింది. ఇకనుండి 'కన్సెషన్' ప్రదేశాలలో జపానువారి పోలీసుల లాగా బ్రిటిషువారు ప్రవర్తించుతారనడంలో సందేహంలేదు.

## ఆంగ్లో - జపాను సంభాషణలు

జపాను చైనా వారిని అప్పగించినా, ఆర్థిక విషయంలో లొంగలేదు. జపాను ఆర్థికంగా కోరిన షరతులు ఇవి (1) చైనా "కరెన్సీ" ఉపయోగించుటమాని, కన్సెషన్ ప్రదేశాలలో జపాను కరెన్సీవాడుట (2) కన్సెషన్ ప్రదేశాలలోని చైనావెండిని జపానుకు అప్పగించుట,

ఈవిషయమై, బ్రిటన్ తరపున రాయబారాలు నడిపే క్రైగికి ఎట్టి సూచనలు లండను నుండి మొదట్లోరాలేదు. ఈ ఆలస్యానికి సహించమంటూ జపాను ప్రకటించింది. అదివరకు కరెన్సీవిషయం చర్చించాలంటే, తమను కూడా సంప్రదించాలని, ఫ్రాంసు అమెరికాలు జపానును అడిగాయి. కాని జపాను తిరస్కరించింది. లండను నుండి సమాధానం లేకుండా ఆలస్యం చేసినందులకు జపాను అసమ్మతి చూపింది. దానికి జవాబుగా బ్రిటిషురాయబారి, తాను టోకియోవచ్చిన 14 దినాలవరకు జపాను వారు సంభాషణలు ప్రారంభించలేదని, అలాగే తాముకూడ ఇతర రాజ్యాలవారితో సంప్రదించడానికి ఆలస్యం అవుతుందనీ తెల్పాడు. 14 వ తేదీలోగా సమాధానం రాకపోతే తాము సంభాషణలు భగ్నమయినట్లే భావించుతామని జపాను ప్రతినిధి తెల్పాడు.

చైనాకు ద్రోహం చేయడం సులభమేకాని తమ ఆర్థిక హక్కుల్ని వదులుకోడం కష్టం. టైమ్సుపత్రిక రెండుసార్లు ఇలా వ్రాసింది "ఎట్టి పరిస్థితులలో చైనా కరెన్సీని, వెండి డిపాజిట్లనుగాని జపాను అధీనంచేయుట అసంభవం." "వెండిసమస్యమీద జపానుతో సంధికి వచ్చినదనుట అబద్ధం." "మనం జపానుకోర్కెలను తిరస్కరించగలం. తిరస్కరించాలి." అని ఫైనాన్షియల్ టైమ్సుపత్రిక వ్రాసింది.

నిజానికిజపాను కరెన్సీ, జపాను విదేశ బాంకులే గుర్తించలేదు, ఆక్రమించబడ్డ ప్రదేశాలలో బలవంతముగా ఉపయోగిస్తున్నారు. కన్సెషన్ ప్రదేశాలు అట్టి ఆక్రమింపబడ్డ ప్రదేశాలు కావుగదా? అని చైనావారు ప్రశ్నిస్తున్నారు.

లండను నుండి వచ్చిన సూచనలలో కరెన్సీ సమస్యలేదు, జపాను ఇక సంభాషణలు సాగించడానికి తిరస్కరించింది, మిలటరీ ఆఫీసర్లను కూడా తిరిగి పంపింది. వీరిని పంపడము ఇంకా కొన్నాళ్లు ఆపాలనిందని బ్రిటిషు రాయబారి అడిగాడు, కాని జపాను తిరస్కరించి పంపివేసింది. బ్రిటిషు ప్రభుత్వ విదేశ కార్యాలయం వారు, ఇతర రాజ్యాలవారితో సంప్రదించకుండా ఈ సమస్య పరిష్కరించడం కష్టమనీ, సంభాషణలను సాగించుట లాభములేదనీ ప్రకటించింది.

జపాను ఈ వైఖరికి ఆగ్రహం చెంది. మళ్లా తీవ్రముగా బ్రిటిషు ప్రతికూల ఉద్యమం లేపింది.

టీన్ట్సిన్‌లో బ్లాకేడ్‌ను తీవ్రపరచడం గాకుండా హాంగ్‌కాంగ్‌ను భూమి సరిహద్దులలో బ్లాకేడ్ చేయాలని జపాను తలుచుతుంది. దీనివల్ల జంగ్ కేషైక్‌కు వచ్చే ఆయుధ సరఫరా ఆగిపోతుందని వాళ్ళ తలంపు.

జపాను దుండగాలను సులభముగా కట్టివేయవచ్చు బ్రిటన్ ఆర్థిక సంబంధాలను త్రెంచుకుంటే. క్రైముల్సు షఫ్టు ఇలా అన్నాడు. "నాచేతికో. హడ్సన్ జర్మనీ కీయదలచిన డబ్బు ఉంటే అది జర్మనీకి గాక చైనాకిచ్చేవాణ్ణి." ఛాంబర్లేను కావాలనే ద్రోహము చేస్తున్నాడు. చైనాలో జపానుతోపాటు తాము దోపిడి చేసికోవాలని ప్రయత్నం. ఇప్పుడు సంభాషణలను భగ్నము చేయడములో కూడా ఒక ఉద్దేశ్యము లేకపోలేదు. ఇక్కడ పరిస్థితులను విషమింపజేసి, డాంజిగ్‌పై సమాధానానికి రా ప్రయత్నించడము, "ప్రాచ్యదేశములో మనం ఆపదలో చిక్కున్నాం, డాంజిగ్‌కై మనం యుద్ధము చేయలేము" అని ఆనాడు చెప్పడానికి ఈ తతంగము అంతా చేస్తున్నాడు.




## డాంజిగ్

ఈ పక్షం వార్తలన్నీ, సంధి సంప్రదింపులు జరుగుతాయని ప్రకటించడం, వాటిని ఖండించే వార్తల ప్రకటించడం.వీటితోనో నిండిఉన్నాయి.

బ్రిటన్ చివరి ప్రయత్నం చేసి చూస్తుంది. డాంజిగ్ నాజీనాయకుడగు 'హెర్ ఫొయిర్‌స్టర్' హిట్లరుతో సంప్రదించనిదే,అతని అనుమతిలేనిదే ఏమీ మాటాడడు. పోలండే డాంజిగ్ ప్రజలను అనవసరంగా రెచ్చగొడుతున్నారని తెల్పుతూ, ఫొయిర్‌స్టర్ ఇలా అన్నాడు. "మేము ఇప్పుడు అదుర్దాచెందం; నాజీలు ఇదివరకు అనుభవంలో, సమయం వచ్చినపుడు తమనాయకుడు సరియైన పని చేస్తాడని తెలుసుకొన్నారు." ఇతని ఉపన్యాసం, పరిస్థితులను తేలికపరచకపోయినా, మితవాదంగా ఉన్న దాని పత్రికలు వ్యాఖ్యచేశాయి. రూటరు విలేఖరి ఈ విషయమై లండన్ అధికారుల అభిప్రాయాన్ని ఇలా తెలిపాడు. "పోలండు జర్మనీలమధ్య కస్టమ్సు విషయమై వచ్చినతగాదా సులభంగా పరిష్కరింపబడుతుందని నమ్ముతున్నారు."

గత సంవత్సరం జకోస్లోవేకియాను ఆక్రమించే ముందు జరిగే పరిస్థితులన్నీ కల్పిస్తున్నారు. "యుద్ధ భీతి" ఎక్కువచేస్తున్నారు, జర్మనీ సైన్యాలు డాంజిగ్‌లోకి ఈస్టు ప్రష్యా సరిహద్దులలోనూ పంపడమేగాక, డాంజిగ్ హద్దులలో ప్రదర్శనాలు జరిగాయి. సరిహద్దు సంఘర్షణలు; డాంజిగ్‌వారు పోలిష్‌వారి నరెస్టు జేయడం, పోలిష్‌వారు డాంజిగ్ వారి నరెస్టు చేయడం జరుగుతూనే ఉంది. పోలండ్‌లో మైనారిటీలగు జర్మనీలను చిత్రవధలు గావించుతూ హింసించుచున్నారనే కథలు జర్మను పత్రికలనిండా అల్లబడుతున్నాయి.

## సంధి సూచనలు

ఇటలీ, జర్మనీ విదేశమంత్రులు సాల్జ్‌బర్గ్ వద్ద సంభాషణలు సాగించారు. ఈ సంభాషణలలో, ఇటలీ కొంత మితవాద వైఖరిని చూపినట్లు స్పష్టమవుతున్నది. ఇటలీయే సంధికి ప్రోత్సహిస్తూఉన్నది. డాంజిగ్‌ను శాంతియుతముగా కాజేయడానికి అక్కడ ప్లానులువేశారు. వీరు సంభాషించిన విషయాలలో జపాను. స్పెయిను సమస్యలుకూడా ఉన్నాయని వేరే చెప్పనక్కరలేదు. పైకిమాత్రం ఇటలీ జర్మనీలు ఎప్పటికీ విడిపోవు. విడదీయడం అసాధ్యం అంటున్నాయి. సీనర్ గయాడా ఇలా వ్రాశాడు. "డాంజిగ్ విషయమై సంపూర్ణమైన ఒడంబడిక కుదిరింది."

హెర్ ఫోయిస్టర్ (డాంజిగ్ నాజీ నాయకుడు) "బ్రిటను లేకపోతే, డాంజిగ్ సమస్య సులభముగా పరిష్కారమయ్యేది." అని అన్నాడు.

ఇటలీ జర్మనీ సూచించిన సంప్రదింపుల ప్లాన్‌ను గురించి పత్రికలు ఆందోళన లేవదీశాయి. పోలిష్ పత్రికయైన, "ఫిగారో" ఇలా ప్రకటించింది. సంధిషరతులివి.

1. జాతిసమితి తరపున ఉండే హైకమీషనర్‌ను (అతని పదవిని) రద్దుచేయాలి

2, డాంజిగ్‌లో పోలండ్ "కమిసారియేట్ జనరల్"ను తీసివేసి, రాజకీయవేత్తల ప్రతినిధుల నుంచడం.

3. డాంజిగ్ పరిపాలన 100 కి 100 పాళ్లు జర్మనులదై ఉండాలి

4. డాంజిగ్ — జర్మనీ సరిహద్దులమధ్య "కస్టమ్సు"ను 5 ఏండ్లలో క్రమంగా అంతంచేయాలి

5. డాంజిగ్‌ను యుద్ధసన్నాహ మయం చేయకుండా జర్మనీ గ్యారంటీ ఇస్తుంది. పోలండు కూడా వెస్టెర్‌ప్లాటి పెనిన్సులావద్ద ఆయుధ

సామగ్రి దుకాణాన్ని తీసివేయాలి;

3. పోలండ్, డాంజిగ్, జర్మనీల ప్రతినిధులతో కూడిన ఒక కమిటీ, డాంజిగ్ రేవు పై అధికారం కల్గి యుంటుంది.

ఇదిగాక, పోలండ్ మరొకప్లాను సూచించినట్లు వార్త, దాని ప్రకారము.

1. డాంజిగ్‌కు పశ్చిమాన ఉన్న కొన్ని ప్రదేశాలు పోలండ్‌కు శాశ్వతముగా చెందుతాయి.

2. డాంజిగ్ తూర్పు ప్రదేశము, వెస్టర్ ప్లాట్టీ దీవితో సహా, జర్మనీకీయాలి.

3. డాంజిగ్‌పట్టణమూ, రేవూ పోలండ్ జర్మనీల సంయుక్త ఆధిపత్యాన ఉంటాయి.

4. దక్షిణ సరిహద్దును, జాతి విభజన ననుసరించి చీల్చుదుము.

కాని ఈ వదంతిని లండను, పోలండులు అబద్ధమన్నాయి. ఇటలీ పత్రికలు మాత్రము సంధిని సూచిస్తూనే ఉన్నాయి. డాంజిగ్‌పై, ఇటలీ జర్మనీలకు సంపూర్ణ సఖ్యత కల్గిందని వెలుటూనే నేషనల్ జీటంగు (జర్మనీ) పత్రిక ఇలా వ్రాసింది. "ఇటలీ జర్మనీల డాంజిగ్, తూర్పు ప్రష్యానుండి జర్మనీకి రహదారుల, సమస్యను పరిష్కరించాలనే తలచుతున్నారు. ఇది యూరప్ మరొక నూతన విధానానికి కాంతికి దారి తీయుటా, తీయకపోవడమా అనే పరీక్ష. కాని అట్టి నూతనవిధానము రావాలంటే, ఇటలీ జర్మనీల ప్రధాన హక్కులను పూర్తి జేయడమే"

ఈ విధముగా, డాంజిగ్ సమస్యపోయి "ప్రధానహక్కు" ల నాకా జర్మనీ వేదము పెరుగుతున్నది.

బిర్కుహోర్టు రాయబారం

ప్రొఫెసర్ బిర్కుహోర్టు, పిలవని పేరంటానికి జర్మనీ వరుగెత్తాడు. ఇతన్ని ఎవరు పంపించారు? ఆశ్చర్యముగానే ఉంది. ఈయనతో హిట్లరు మాట్లాడే దేమిటి? 'లా అర్డ్రీ' అనే ఫ్రెంచి పత్రికలో 'పెర్టినాక్స్' ఇలా వ్రాశాడు. "యుద్ధము చేయకుండా, యుద్ధములో జయించి చేసే దోపిడిని చేయాలని జర్మనీ ప్రయత్నం"

అయితే ఈ సంప్రదింపులకు పైకి పోలండు తిరస్కరించుతూనే ఉంది. జర్మనీ "డాంజిగ్‌పై సంధి అసంభవం-అవమానం" అంటూ పైకి బుకాయిస్తూనే ఉంది ఇంగ్లండు ఫ్రాంసులు తమకేమి తెలియదని అంటున్నాయి. నాలుగు లేక ఐదు రాజ్యాల ఒడంబడిక ఒకటి జరుగుతుందని (రష్యా తప్ప) వదంతు లుండనే ఉన్నవి. ఇవన్నీ ఒకప్రక్క యుద్ధాన్ని, మరొకప్రక్క రాయబారానికీ జర్మనీ ప్రచారం చేస్తున్నదని కొన్ని పత్రికలంటున్నాయి.

పోలిష్ కమిషనరు 'చొడాకీ,' డాంజిగ్ సెనేట్ ప్రెసిడెంటు, 'హెర్ గ్రీజర్,' లీగ్ పై కమిషనర్ 'బర్కు హార్టు' డాంజిగ్ కష్టమ్సు సమస్యనేగాక, ఇతర సమస్యలను గురించికూడా మాట్లాడారు. ఈ విధంగా జర్మనీ పోలండులు స్వయంగా మాట్లాడుకోవడం మంచిదని ఇటలీ ప్రోత్సహించింది.

ఛాంబర్లేను, డాంజిగ్‌నుకూడ సమర్పిస్తాడా? పరిస్థితులు మాత్రం పూర్వం లాగానే-జకొస్లొవేకియాను గుటకాయ స్వాహ చేసేముందున్నట్లుగానే-కల్పింపబడ్డాయి. కాని మ్యూనిక్ వంటి నాటకం ఆడటం అంత సులభం కాదు. మ్యూనిక్‌తో ప్రజల కండ్లు తెరువబడ్డాయి. దానితోపాటు రోజురోజుకూ ఛాంబర్లేనుకు కథ అర్థం తిరుగుతోంది. అందుకనే టైమ్సు పత్రిక వెనుకటి తప్పును ఇప్పుడు చేయడం లేదు. వెనుక బ్రిటనుచేయబోయే ద్రోహాన్ని ముందే సూచించింది. ఇప్పుడలా చేస్తే, ప్రజాభిప్రాయం తీవ్రంగా వ్యతిరేకమవుతుంది. అందుకని 'టైమ్సు' జర్మనీపై కఠోరంగా ఉన్నట్లే ప్రకటించుతోంది. ఏమైనా ఈ సారి ప్రపంచాన్ని మోసగించడం అంత సులభం కాదు. నిన్నటి పత్రికల ధోరణిచూస్తే యుద్ధం ఒక వారం రోజులలోనే రావచ్చు అన్నట్లు వాతావరణం సృష్టింపబడింది.

## హంగేరీపై ఒత్తిడి

ఇటలీ జర్మనీలుకూడా సన్నాహంలో ఏమీ తక్కువలేవు, ఇటలీ జర్మనీ మిలటరీ సంధిలో చేరమని జపానును బలవంతంచేశాయి కాని జపాను అంగీకరించలేదు. స్పెయినుకూడా బలవంతపెట్టినాయి. స్పెయిన్‌లో క్రొత్తగా ఫెలాంగిస్టులు (ఇటలీ జర్మనీల కనుకూలురు) అధికారానికి వచ్చినా, తటస్థంగానేఉండి పునర్నిర్మాణం గావించుకొంటామని ప్రకటించింది. కాని స్పెయిను కిష్టంఉన్నా లేకపోయినా, అవసరమైనపుడు దాన్ని తమతోపాటు రోం-బెర్లిన్ కూటమిలాగుతుంది అని వేరే చెప్పనక్కరలేదు. "జిబ్రాల్టర్" మాకు కావాలనే ఆందోళన స్పెయిన్ పత్రికలు లేవదీయడంలో అంతరార్థం ఇదే. ఇటలీ యుగోస్లేవియాపైకూడ ఒత్తిడి తెస్తున్నది. యుగోస్లేవియాపై పైకి ముసోలినికి ఎన్ని అభినందనాలు తెల్పుతున్నా, ఇటలీకోరికను అంగీకరించడములేదు. యుద్ధం వస్తే, స్లొవేకియాలోని రైల్వేని (యుగోస్లోవియాది) రోం-బెర్లిన్ కూటమికి అప్పగించాలని ఇటలీ కోరింది. కాని యుగోస్లోవియా నిరాకరించింది. ఇలాగే హంగేరీని పూర్తిగా తమ స్వాధీనంలో ఉంచాలని జర్మనీ ఒత్తిడితెస్తున్నది. హంగేరీ విదేశాంగ మంత్రి ఈమధ్య ఇటలీ జర్మనీలలో తిరిగివచ్చాడు. ఇటలీ జర్మనీలు తమను ఏమీ అడగలేదని ప్రకటించినా అది అబద్ధం అని ప్రపంచానికంతకూ తెలును హంగేరీ జర్మనీలో కలిసినా కలియకపోయినా జర్మనీ చేతిలో ఉంటుంది. సమయం వచ్చినపుడు, జర్మనీ చెప్పుచేతుల్లో మెలగుతుంది. హంగేరీ జర్మనీతో మిలటరి సంధికివస్తే, అది జర్మనీ దురాక్రమణకు ప్రాతిపదికగా ఉపయోగిస్తుంది. యుగోస్లోవియాగుండా అడ్రియాటిక్ సముద్రంలోకి రుమేనియాగుండా నల్లసముద్రములోకి జర్మనీ దూకవచ్చు.

## స్లొవేకియాకు స్వస్తి

17 వ తేదీన, జర్మనీ స్లొవేకియాతో మిలటరీ సంధిచేసికొంది. మిలటరీ రక్షణ జర్మనీ ఇకముందు వహించుతుందట. గత సెప్టెంబరులో హిట్లర్ 'తమ జర్మనుల హక్కులనే కోరుతున్నాన'ని సుడెటన్ భూమిని ఆక్రమించాడు, గతమార్చిలో బొహేమియా, మొరేవియాలను దిగమ్రింగాడు. అయిదు నెలలయినా కాలేదు, 25 ఏండ్లు స్వాతంత్ర్యపు గ్యారంటీ నిచ్చిన నామమాత్రపు స్లొవేకియా స్వతంత్ర రాజ్యాన్ని దిగమ్రింగాడు. 25 ఏండ్ల స్వాతంత్ర్యము 5 నెలలో ముగిసింది. నిరత సత్యవ్రతుడు హిట్లర్!

అంతర్జాతీయ పరిస్థితులిట్టి విషయస్థితిలో నుండగా, బ్రిటిషు, ఫ్రెంచి మంత్రివర్గాలు సమావేశ మవుతున్నాయి. పోలండులోని బ్రిటిషు వారిని, తమ దేశానికి పోవలసిందని బ్రిటను హెచ్చరించింది. రోం, వార్సా, లండన్, ఫ్రాంసులలో, హడావిడి హెచ్చింది. ప్రస్తుత పరిస్థితులను గూర్చి టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక ఇలా వ్రాసింది.

"1914 లో జర్మనులు బ్రిటిషు వైఖరిని గ్రహించలేదు. 1939 లో కూడ అదే తప్పును బ్రిటన్ చేస్తోంది. అని భయము కల్గుతుంది; బెల్జియమును గురించి, ఒకకాగితపు ముక్కను గురించి, బ్రిటన్ యుద్ధానికి వెళ్లడము ఎందుకు అనిప్రశ్నించాడు 'బెత్‌మాన్ వాన్ హాల్‌వెగ్'. ఆ ప్రశ్ననే జర్మనీ ఇపుడు వేస్తున్నది, కాని అప్పటికంటె ఇప్పుడు బ్రిటనుకు బాధ్యత అధికముగా ఉంది....సంప్రదింపులద్వారా ఇంగ్లండు బ్రిటనులు సాధారణ పరిష్కారానికి సిద్ధంగా ఉన్నాయి. కాని దౌర్జన్యము ఉపయోగిస్తే, దౌర్జన్యం తిరిగి ఉపయోగిస్తాయి." ఇది బ్రిటిషు ప్రభుత్వ వైఖరిని తెలియ జేస్తుందని వేరే చెప్పనవసరములేదు.

కాని నిజంగా డాంజిగ్‌ను సంరక్షించాలంటే సోవియటు రష్యాతో సంధికి రావాలి. కాని, మిలటరీ సంభాషణలుకూడా ఇదివరకు సంభాషణలలాగానే కొనసాగుతున్నాయి. వాటికి దారీ డొంకా కన్పించడంలేదు.

రూటర్ విలేఖరి యూరప్ సైనికబలాన్ని ఈక్రింది విధంగా తెల్పాడు. ఇదంతా "శాంతి సమయం" అని చెప్పబడేకాలం లోనిదే.

| | |
|---|---|
| ఫ్రాంసు | 1,000,000 |
| బ్రిటన్ | 600,000 |
| పోలండ్ | 500,000 |
| టర్కీ | 300,000 |
| రుమేనియా | 275,000 |
| గ్రీసు | 200,000 |
| మొత్తం | 2,875,000 |

| | |
|---|---|
| జర్మనీ, ఇటలీ, హంగేరీ | 2,700,000 |
| సోవియట్ రష్యా | 2,000,000 |

కాబట్టి, రష్యాతో బ్రిటన్ కలవవలసిన అవసరం వేరే చెప్పనక్కరలేదు. కాని ఛాంబర్లేను కలవడానికి నిరాకరిస్తూ, ఆలస్యం చేస్తున్నాడు.

## సోవియట్ రష్యా-జర్మనీల మైత్రి?

ఇదివరకు సోవియటు రష్యాకు జర్మనీ అప్పు ఇచ్చేటట్లు, జర్మనీకి వస్తువులను సోవియటు సప్లయి చేయడానికి ఒక సంధి జరిగింది. ఇదేమంత ఆశ్చర్యకరమైన విషయంగాదు. ఇదివరకు జర్మనీతో వర్తక సంబంధాలు కల్గి ఉన్నది. అలాగే జపానుతో నూనెకు సంబంధించిన ఒడంబడికలున్నాయి.

కాని హఠాత్తుగా ఇపుడింకో వార్త వచ్చినది 'అది సోవియటు రష్యా, జర్మనీలు ఒకరిపై ఒకరు దాడి సల్పమని సంధి చేసికోవడం. దీనిని గురించి బాధ్యతాయుతమైన సోవియటు ప్రకటన ఏమీ రాలేదు. కాని ఇందులో ఆశ్చర్యమేమిటో మాకర్థంకావడం లేదు.

అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకమగు జర్మనీతో సంధియా? ఫాసిజానికి, కమ్యూనిజానికి సంధియా? శాంతిని కోరే రష్యాకు, ఉల్లంఘించే జర్మనీకి సంధియా? అని మూర్ఛపోయేవారున్నారు. కాని మూర్ఛపోవ నవసరం లేదు.

సోవియటు విదేశనీతి ఎప్పుడూ శాంతిని కోరుతుంది. 'దొంగల గుంపు' అని తెలిసికూడ నానాజాతి సమితిలో చేరి తక్కిన దేశాల విఘాతుక కృత్యాలను బయటపెడుతూ వచ్చింది. ఇపుడు కన్నపుదొంగవచ్చి, "మీ యింటిలో కన్నం వేయ దలచుకోలేదు. నీ కిష్టమేనా?" అంటే, "నా కిష్టములేదని" జవాబివ్వాలా? సోవియటు అలా జవాబివ్వదు. కాని కన్నపు దొంగమాటలను విశ్వసించి తలుపుకు గడియ వేసుకోడం మానివేయదు జాగ్రత్తగానే ఉంటుంది కాని బ్రిటనో, "కన్నపు దొంగను వీడు కన్నపుదొంగకాదు మహామంచివాడు. మీరు రక్షించుకోవలసిన పనిలేదు. మేం కాపాడతాం." అని చెప్పి తలుపులు తెరచి, యజమాని తెక్కల విరచికట్టి, కన్నపు దొంగకు సామాను అప్పగించుతుంది. ఇంతే భేదం;

సోవియటు రష్యాతో రాజీకి రావడంవలన ఈ క్రింది విషయాలు స్పష్టమౌతాయి.

1. జర్మనీ సులభంగా రాజీకి రాగల్గితే, బ్రిటను ఎందుకు రాలేకపోయింది? బ్రిటనుకు ఇష్టం లేకపోవడం వలననే అని తేటతెల్లమవుతుంది ప్రపంచానికి.

2. పోలండు ఇంతవరకు తిన్నగా సోవియటుతో సంధికి రాకపోవడం దానితప్పే.

3. ఇప్పటికైనా బ్రిటను ఫ్రాంసులు త్వరపడాలి.

4. రష్యా బలాన్ని చూచి జర్మనీ భయపడింది.

ఇంతేగాక సోవియటు రాజనీతి ఏమీమారదు ఇప్పటికీ,

1. ఏ దేశముతోనైనా, సంధికి సిద్ధముగా యున్నది.

2. ఇప్పటికీ స్పెయిన్, జకోస్లోవేకియా ఆక్రమణలను గుర్తించదు.

అయినా హిట్లర్ ఎన్ని సంధులు చేసికోలేదు. ఎన్ని ఉల్లంఘించలేదు. ఛాంబర్లేనును బలహీన పరచడానికే హిట్లర్ ఈయెత్తువేశాడు. ఇపుడు ప్రపంచ యుద్ధం వాయిదావేయబడింది. అంగ్లో జర్మనీ యుద్ధమో, డాంజిగ్‌ను అర్పించడమో సమీపించుతున్నది.



## రిపోర్టులు ఎలా ఉండాలి?

పార్టీ సభ్యులు చేసే ప్రచారాన్ని గురించి తాము పంపే రిపోర్టులలో కొందరు తాము ఏ యే విషయాలను గురించి ఉపన్యాసాలిచ్చారో మాత్రమే వ్రాసి ఊరుకుంటున్నారు. అలాకాకుండా, ఒక్కొక్క గ్రామంలో ఉన్న యిబ్బందులు, ఆ యిబ్బందులు తొలగించుకోవడానికి గ్రామస్థులు యిదివరలో చేసినకృషి, పార్టీ సభ్యులు వారికిచ్చిన సలహా, తాము యిచ్చిన ఉపన్యాసాలు గ్రామస్థులలో యెట్టి అభిప్రాయము కలిగించినదీ మొదలైన అంశాలు కూడా ఉండాలి.

కాన్ఫరెన్సు రిపోర్టులు దిన పత్రికలకు పంపేమాదిరిగా ఉండరాదు. పూర్తి ఉపన్యాసాలు, పూర్తి తీర్మానాలు పూర్తి చర్చలు పంపనవసరము లేదు. ప్రతినిధుల నెదుర్కొంటున్న ప్రధాన సమస్యలు, కాన్ఫరెన్సుకు వచ్చిన ప్రతినిధుల సంఖ్య, ప్రేక్షకులసంఖ్య, కాన్ఫరెన్సు యేర్పాట్లుఉపన్యాసాల సారాంశము, ప్రధాన తీర్మానాలు, ముఖ్యమైన చర్చలు - యివి క్లుప్తంగా ఒక కథ మాదిరిగా, ఉండాలి.

Published by M. Chandrasekhara Rao
Printed by Tummala Venkata Ramiah } at Navasakti Press, Governorpet, Bezwada.

